## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంథాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంథాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **ద్వారకాదీష్ వాస్తు** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంథాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంథాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన అర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంథాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంథాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ద్వారకాదీష్ వాస్తు** వారి వెబ్ సైట్: http://dwarkadheeshvastu.com
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) అర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో **ద్వారకాదీష్ వాస్తు** వెబ్ సైట్ వారు అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు,కనుక వారిని సంప్రదించగలరు.

**Sai**Real**A**ttitude**M**anagement(SAI RAM) **- సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## ద్వారకాదీష్ వాస్తు వారి వెబ్ సైట్:

## http://dwarkadheeshvastu.com

Free Download Indian epic ×

dwarkadheeshvastu.com/Epic-List-of-Indian-Epics-in-Telugu.aspx

Hindi | Sanskrit | English | Gujrati | Bangali | Oriya | Telugu | Nepali | Marathi | Kannad | Asamiya | Urdu | Malyalam | Avdhi | Ved | Puran | Bhagwat | Ramayan | Geeta | Punjabi | Jain Dharm | Islam | Karm Kand

Dwarkadheesh Vastu

Home
Contact Us
हिन्दी वेबसाईट
Vastu Consultancy
Download Vastu Book
FREE Astrology Books

FREE Devotional Music (Mp3)
FREE Devotional Videos
FREE Devotional Books (PDF)
FREE Educational Books (PDF)
FREE Educational Videos
FREE Devotional Wallpapers

Dwarkadheesh Vastu
Like
3,663 people like Dwarkadheesh Vastu.
Facebook social plugin

A | B | C | D | E | F | G | H | I
J | K | L | M | N | O | P | Q | R
S | T | U | V | W | X | Y | Z

1. 12 Rashi Fal (Hindi)
2. 300 Saal Sikh Itihaas De Naal (English)
3. Aachar Manjari (Nepali)
4. Aadarsh Bhakti Prem (Telugu)
5. Aadarsh Dampatya Jeevan (Telugu)
6. Aadarsh Desh Bhakt (Hindi)
7. Aadarsh Manav Hridaya (Hindi)
8. Aadarsh Nari Sushila (Bengali)
9. Aadarsh Nari Sushila (Gujrati)
10. Aadarsh Nari Sushila (Tamil)

### Indian Epics in Telugu

1. Aadarsh Bhakti Prem (Telugu)
2. Aadarsh Dampatya Jeevan (Telugu)
3. Aadarsh Nari Sushila (Telugu)
4. Aadhyatm Ramayan (Telugu)
5. Aandhra Mahabhagwat Dasham Skandh (Telugu)
6. Agni Puranam (Telugu)
7. Aladdin Adbhutha Deepam (Telugu)
8. Alibaba Dongalu Katha (Telugu)
9. Amavasya Somavara Vratham (Telugu)
10. Amma Neeti Kathalu Katha (Telugu)
11. Amulya Samaya Ka Upyog (Telugu)
12. Anantapadmanabha Asthotram (Telugu)

You Tube

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

వానియందు రుచియు, మన మహర్షుల త్యాగమయములైన చరిత్రలు, ధర్మము, దైవము మున్నగు విషయములందరుచియు గలుగుచున్నది. ఇది యంతయు పాశ్చాత్య విద్యాభ్యాసమువలన ప్రాప్తించుచున్న భయంకర పరిణామము.

దీనిని బట్టి బాలురెంత మాత్రము పాశ్చాత్యవిద్యను అభ్యసింపరాదనుట నా యభిప్రాయమనుకొనరాదు. మఱి యేమన మన బాలకులు తొలుత ధార్మికవిద్యను అభ్యసించి అటుపిమ్మట పాశ్చాత్య విద్యాభ్యాసమునకు పూనుకొనుట యుక్తమనుట నా యభిప్రాయము. అట్లు చేయుట సాధ్యము కాని నాడు ధార్మిక విద్యతో బాటు పాశ్చాత్యవిద్యను కూడ కలిపి అభ్యసించునట్టి యేర్పాటు జరుగవలయును. ఎవ్వరైన విషమును సేవించుట యన్నది మృత్యువునకు ఆహ్వానమంపుటయే యగును. కాని ఆ విషమునే ఔషధముతో గాని, కొన్ని ఓషధులతో సంస్కరించి కాని సేవించిన నాడు అది అమృతతుల్యమైన ఫలమునొసంగును. అట్లే మనము కూడ మన బిడ్డలకు ధార్మిక శిక్షణతో బాటుగా ధర్మముచేత సంస్కరింప బడిన పాశ్చాత్య విద్యను నేర్పింపవలయును.

కారణమేమన ధర్మమే మానవుని జీవనమును, ప్రాణములను, ఇహపరములను చక్కజేసి వానికి శుభమును చేకూర్చును. ఒక్క ధర్మమే పరలోకమువరకు మానవుని వెంబడి వచ్చునది. భార్య, బిడ్డలు, బంధువులనబడువారు ఎవ్వరును వెంట వచ్చువారుకారు. వారు ఎట్టి సహాయ సహకారములను అందింపజాలరు. కాబట్టి ప్రతి మానవుడును నిరంతరమును ధర్మ సంగ్రహము చేసుకొనవలయును. మనమిప్పుడు ఆధర్మము యొక్క స్వరూపమును గురించి విచారణ చేయుదము.

ధర్మమనగా సద్గుణ సంపద, సదాచారము అని మహర్షులు వ్యాఖ్యానించి యున్నారు. భగవానుడు భగవద్గీత 16వ అధ్యాయములో 'దైవీసంపద' అనుపేరున 17వ అధ్యాయములో 'తపస్సు' అను పేరునను ధర్మమును తెలిపియుండెను. పతంజలి మహర్షి యోగ శాస్త్రములో రెండవ పాదములో సూత్రరూపమున యమనియమములే ధర్మస్వరూపమని వ్యాఖ్యానించెను. మనుమహర్షి కూడ 6వ అధ్యాయము 92వ శ్లోకములో ధర్మలక్షణములను పదింటిని పేర్కొనెను. ఈ విషయములన్నిటిని పరిశీలింపగా సదాచారము, సద్గుణ సంపదలకే ధర్మమని పేరనుట రూఢియగుచున్నది.

తనకు, లోకమునకంతకును క్షేమకరమైనది ఏదో అది అనగా మనసా, వాచా, కర్మణా ఏ క్రియ ఉత్తమమయినదో అది సదాచారము. అంతఃకరణములో పవిత్రమైన భావమేది యున్నను అది సద్గుణము అని చెప్పవచ్చును.

అయినచో అట్టి ధర్మము మనకెట్లు ప్రాప్తించును? అన్నది ఇప్పటి ప్రశ్న. సత్పురుషుల సహవాసమువలననే మనము '' ధర్మమును బడయగలము. వేదములు, స్మృతి, సదాచారము, తన అభిరుచి అను ఈ నాల్గింటిననుసరించి పరిణామదశయందు క్షేమమును గల్గించునది ఏదో అది ధర్మము. మనువు చెప్పినది కూడ ఇదియే.

శ్లో. వేదః స్మృతిః సదాచారః స్వస్య చ ప్రియమాత్మనః
ఏతచ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్య లక్షణమ్. **(2-12)**

ఒక్క సత్సంగమువలననే ఈ నాలుగు లక్షణములకేకత్వము సమన్వయమును సిద్ధింపగలదు. వీనిలో పరస్పరవైరుధ్యమేర్పడినప్పుడు ఆ వైరుధ్యము తొలగి యదార్థము నిర్ణయింపబడుట కూడ సత్సంగమువలననే సాధ్యమగును. కావున సజ్జనసాంగత్యము తప్పక చేయవలయునది. వేదముల, స్మృతుల మూలమున ప్రతిపాదింపబడిన

ధర్మమే ఇతిహాసములందును పురాణములందును వ్యాఖ్యానింప బడినదన్న మాటను మనము మఱచి పోకూడదు. కావున ఆ ఇతిహాసపురాణాదులు బోధించునది కూడ ధర్మమే యగును.

ఈ కారణముననే ప్రాణములు పోయిన బోవుగాక! ధర్మమును మాత్రము విడువరాదనుట సూక్తియైనది. ఏలయన ధర్మము కొఱకు ప్రాణములర్పించువానికి ఉత్తమగతి ప్రాప్తించును. సిక్కుల గురువగు గోవిందసింగ్ కుమారులు ధర్మము కొఱకు ప్రాణములర్పించి అచంచలమైన కీర్తిని, ఉత్తమగతిని పొందిరి. మనువుకూడ ఈ విషయమునే తెలిపియున్నాడు.

శ్లో. శ్రుతిస్మృత్యుదితం ధర్మ మనుతిష్ఠన్ హి మానవః
ఇహ కీర్తిమవాప్నోతి ప్రేత్య చానుత్తమం సుఖమ్. (2-9)

వేదములందు, స్మృతులయందును ప్రతిపాదింపబడిన ధర్మమును పాటించుచు కాలము బుచ్చిన మానవుడు లోకములో కీర్తిని, మరణానంతరము పరమాత్మ ప్రాప్తిరూపమగు పరమ సుఖమును పొందును.

కావున బాలకులారా! మీకన్ని విధముల అన్నిటికంటె ఎక్కువ ఉపయుక్తములగు విషయములు ఏవియో వానిమీదనే మీరు మీ దృష్టిని సర్వదా కేంద్రీకరించుడు! మీరు గమనింపవలసిన విషయములు అనేకములున్నవి. వానిలో ప్రధానముగా ఆరు విషయయములను ప్రాణాధిక ప్రియతమములైనవని భావించుకొని సర్వదా వానిని పాటించు విషయమున మిక్కిలి శ్రద్ధ వహింపుడు. అవి ఏవి యనగా - సదాచారము, సంయమము, బ్రహ్మచర్య పాలనము, విద్యాభ్యాసము, తల్లి, తండ్రి, గురువు మున్నగు పెద్దలను సేవించుట, భగవంతునిపై భక్తి కలిగియుండుట యనునవి.

---

# సదాచారము

సదాచారమనగా శాస్త్రానుసారముగా విహితములైన కర్మల పాలనము. అట్టి విహితకర్మలలో అంతర్గతములయినవే పైన పేర్కొన్న ఆరు కర్మలును. కావున వానిని సదాచార మనియే పరిగణింపవలెను. ఈ ఆరు విషయములును అత్యంత ప్రధానములైన కారణమున బాలుర హితమును గోరి వీనిని విపులముగా వివరింప బూనుచున్నాను. దీనిని బట్టి ఇవి మాత్రమే బాలురకుపయుక్తములైన విషయములు అని భావింపరాదు. వారికుపయోగపడునట్టి విషయములింకను అనేకము లున్నవి. వానిలో సదాచారము అనుపేర ఇచ్చుట కొన్నిటికి మాత్రమే విపులవివరణము నిచ్చుచున్నాను.

చిన్నపిల్లలు ముందుగా ఆచార విషయమున శ్రద్ధ వహింపవలయును. ఏలయనగా ఆచారము నుండియే ఎల్ల ధర్మములు ఆవిర్భవించుచున్నవి. మహాభారతము – అనుశాసన పర్వము – 149వ అధ్యాయములో భీష్ముడు కూడ ఇట్లు చెప్పియుండెను.

శ్లో. సర్వాగమానామాచారః ప్రథమం పరికల్పతే
ఆచారప్రభవో ధర్మో ధర్మస్య ప్రభురచ్యుతః

శాస్త్రములన్నిటియందును ఆచారమే కల్పన చేయబడినది. ఆచారమునుండియే ధర్మము ఆవిర్భవించుచున్నది. ఆ ధర్మమునకు ప్రభువు అచ్యుతుడు.

ఈ ఆచారము శౌచాచారము, సదాచారము అని రెండు విధములు. నీరు మట్టి మున్నగు వానితో శరీరమును శుభ్రపరచు కొనుటయు, అన్నవస్త్రాదులు, గృహము, పాత్రలు మున్నగువానిని శాస్త్రానుసారముగా శుభ్రపరచుకొనుటయు శౌచాచారము అనబడును.

ఎల్లవారలతోడను యోగ్యముగా మెలగుటయు. సర్వదా శాస్త్రోక్తములైన సత్కర్మమునాచరించుటయు సదాచారము అనబడును. ఈ సదాచారమువలన దుర్గుణములు, దురాచారములును నశించును. అంతశ్శుద్ధియు, బాహ్యశుద్ధియు ప్రాప్తించును. సద్గుణము లుదయించును.

ప్రథమముగా ప్రాతఃకాలమున, సూర్యుడుదయింపక ముందే మేల్కొని శౌచవిధిని నిర్వర్తించుకొని స్నానమాచరింపవలెను.

(శౌచవిధి - మలత్యాగము చేసికొన్న తరువాత ముమ్మాఱు మట్టితోను, నీటితోను మలద్వారమును కడిగికొనవలయును. పిమ్మట దుర్గంధము, జిడ్డు పోవునంతవరకు నీటితో ప్రక్షాళించుకొనవలయును. మలమూత్రపరిత్యాగమయిన వెంటనే ఉపస్థమును కూడ నీటితో కడుగవలయును. మలత్యాగానంతరము మట్టితో 10 మాఱులు ఎడమచేతిని, 7 మాఱులు రెండు చేతులను కలిపియు కడుగుకొనవలయును. మట్టితోను, నీటితోను ఒకమాఱు పాదములను, ముమ్మాఱు పాత్రమును ప్రక్షాళించుకొనవలయును. కరచరణములను కడిగికొన్న మీదట ముఖమునందలి రంధ్రములనన్నిటిని కడుగుకొని దంతధావనము గావించుకొని నీటిని పుక్కిలించి ఉమియవలయును.)

స్నానానంతరము నిత్యకర్మానుష్ఠానము గావించుకొని పెద్దలకు పాదాభివందనములు చేయవలెను. అటుపిమ్మట శరీరారోగ్యమును బలమును పెంపొందుటకై పశ్చిమోత్తనాసనము, శీర్షాసనము, విపరీత కరణి మున్నగు ఆసనములు వేసి వ్యాయామము చేయువలెను. అనంతరము పాలను సేవించి విద్యాభ్యాసము చేయువలెను. ఆసనములను, వ్యాయామమును సాయంకాలము కూడ చేయదలచు కొన్నచో పాలు సేవింపకయే విద్యాభ్యాసము చేయవలెను.

విద్యాభ్యాసము అయిన తరువాత మధ్యాహ్నసమయమున అనగా పగటివేళ రెండవ జాము యుక్తమైన సమయమందు ఆచమనము గావించి సావధానముగా పవిత్రమైన సాత్త్వికాహారమును గ్రహింపవలెను. ఆ యాహారమును కూడ ఆకలి శాంతించునంతవరకే గ్రహించవలెను. అధికముగా గ్రహింపరాదు. ఈ విషయమున మనువు ఇట్లు చెప్పెను –

శ్లో. ఉపస్పృశ్య ద్విజో నిత్యమన్నమద్యాత్సమాహితః
భుక్త్వా చోపస్పృశే త్సమ్యగద్భిః ఖాని చ సంస్పృశేత్.
(2-53)

బ్రాహ్మణుడెల్లప్పుడును ఆచమనము చేసియే సావధానముగా అన్నమును భుజింపవలెను. భోజనానంతరము కూడ మఱల ఆచమనము గావించి నీటితో ఆరు రంధ్రములను ( కన్నులు, చెవులు, ముక్కు) స్పృశింపవలెను.

శ్లో. పూజయేదశనం నిత్యమద్యాచ్చైతదకుత్సయన్
దృష్ట్వా హృష్యేత్ప్రసీదేచ్చ ప్రతినందేచ్చ సర్వశః. (2-54)

భోజనమును నిత్యము ఆదర దృష్టితో చూడవలెను. కాని నిందింపరాదు. భుజించువేళ దానిని చూచి హర్షమును, ప్రసన్నతను ప్రకటింపవలెను. ఎల్ల విధముల దానిని అభినందింపవలెను.

శ్లో. పూజితం హ్యశనం నిత్యం బలమూర్జం చ యచ్ఛతి
అపూజితం తు తద్భుక్తముభయం నాశయేదిదమ్. (2-55)

ఏలయనగా ఆదర దృష్టితో గ్రహింపబడిన యాహారము బలమును, వీర్యమును గలిగించును. అనాదర భావముతో తిన్న యన్నము ఆ రెండింటిని నాశనము చేయును.

శ్లో. అనారోగ్యమనాయుష్య మస్వర్గ్యం చాతిభోజనమ్
అపుణ్యం లోకవిద్విష్టం తస్మాత్తత్పరివర్జయేత్. (2-57)

మితిమీటి చేసిన భోజనము ఆరోగ్యమును, ఆయువును, స్వర్గమును పుణ్యమును నశింపజేయును. అది లోకనిందితమయినది. కావున దానిని పరిత్యజింపవలెను.

భోజనము చేసిన తరువాత పగటివేళ నిద్రింపరాదు. ప్రయాణము చేయరాదు. విద్యాభ్యాసము కూడ ఒకగంట గడచిన మీదటనే చేయువలెను. విద్యాభ్యాసము అయిన తరువాత సాయంకాలము మఱల శౌచ విధియు, స్నానమును చేసికొని నిత్యకర్మానుష్ఠానమును ఆచరింపవలెను. అటు పిమ్మట రాత్రి భోజనము చేసి కొంతసేపయిన మీదట రెండవ జాము మొదలగుచున్న వేళ పరుండవలెను. చిన్న పిల్లలు ఇంచుమించుగా 7 గంటల కాలము నిద్రింపవలెను. సూర్యోదయమగు వరకు నిద్రనుండి మేల్కొనలేక పోయిననాడు పగలంతయు ఉపవాసము చేసి గాయత్రీ జపము చేయువలెను. ఇది మనువు చెప్పిన మాట –

శ్లో. తం చేదభ్యుదియాత్సూర్యః శయానం కామచారతః
నిమ్లోచేద్వాప్యవిజ్ఞానాజ్జపన్నుపవసేద్దినమ్. (2-220)

బ్రహ్మచారి ఇచ్ఛాపూర్వకముగా నిద్రించుచుండగా సూర్యోదయము కాని అస్తమయము కాని జరిగినచో అతడు ఆదినమంతయు గాయత్రిని జపించుచు వ్రతమును పాటింపవలెను.

శ్లో. సూర్యేణ హ్యభినిర్ముక్తః శయానో ఽభ్యుదితశ్చ యః
ప్రాయశ్చిత్తమకుర్వాణో యుక్తః స్యాన్మహతైనసా.
(2-221)

ఏ బ్రహ్మచారి యైనను నిదురించుచుండగా సూర్యుడు ఉదయించుట కాని అస్తమించుట కాని సంభవించినచో, ఆ విషయమున అతడు ప్రాయశ్చిత్తము చేసుకొనకపోయినచో వానికి మహాపాపము సంక్రమించును.

నిత్యకర్మలుగా భగవన్నామ జపము, ధ్యానము, కనీసము భగవద్గీతలోని ఒక అధ్యాయము పారాయణము తప్పక ఆచరింపవలెను. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, హోమము, సంధ్యావందనము, గాయత్రీ మంత్రజపము స్వాధ్యాయము, దేవతారాధనము, తర్పణములు కూడ ఆచరింపవలెను. వీనిలో కూడ గాయత్రీ జపము, సంధ్యావందనము మాత్రము మానకుండ విధిగా ఆచరింపవలయు నట్టివి. వీనినాచరింపకున్నా ప్రాయశ్చిత్తము చేసుకొనవలసిన పరిస్థితియు, పాతిత్యమును ప్రాప్తించును. బ్రహ్మచారి యగువానికి సూతకము (మైల) ఎన్నడును లేదు. నిత్యకర్మాచరణ విషయమున ఎవరికిని ఎట్టి యడ్డునులేదు.

(శిశువు జన్మించినపుడు కలుగు సూతకమును పురుడు అనియు, ఎవరైనను మరణించినపుడు ప్రాప్తించు సూతకమును మైల యనియు పేర్కొందురు కదా! ఈ రెండు దశలయందును సంధ్యా వందనము, గాయత్రీ జపము మున్నగు నిత్యవైదిక కర్మలను నీరుపయోగించకుండ కేవలము మంత్రోచ్చారణ పూర్వకముగా ఆచరింపవలెను. సూర్య భగవానునకు అర్ఘ్యము మాత్రమొసగవలెను.) మన తెలుగునాట అర్ఘ్య ప్రదానము వరకు మాత్రము సంధ్యావందనము చేయుట పరిపాటి.

నిత్యకర్మమును మాత్రము సర్వదా ఆచరించుచునే యుండవలెను. ఈ విషయమున మనువు చెప్పిన మాట –

శ్లో. నిత్యం స్నాత్వా శుచిః కుర్యాద్దేవర్షిపితృతర్పణమ్
దేవతాభ్యర్చనం చైవ సమిదాధానమేవ చ. **(2-176)**

బ్రహ్మచారి యగువాడు ప్రతిదినము స్నానమాచరించి పరిశుద్ధుడై దేవతలకు, ఋషులకు, పితృదేవతలకు తర్పణములును, దేవతా పూజనము, అగ్నిహోత్ర విధిని తప్పక నిర్వర్తింపవలెను.

శ్లో. న తిష్ఠతి తు యః పూర్వాం నోపాస్తే యశ్చ పశ్చిమామ్
స శూద్రవద్బహిష్కార్యః సర్వస్మాద్ద్విజకర్మణః. (2-103)

ఏ మానవుడు ఉదయమున, సాయంకాలమునందు సంధ్యావందన విధిని ఆచరింపడో వాడు శూద్రునివలె బ్రాహ్మణ కర్మలన్నిటి నుండియు బహిష్కరింపబడవలసిన వాడగును.

శ్లో. నైత్యకే నాస్త్యనధ్యాయో బ్రహ్మసత్రం హి తత్స్మృతమ్.
(2-106)

నిత్యకర్మకనధ్యాయము లేదు. అనగా మానివేయ వీలులేదు. ఏల యనగా అది బ్రహ్మయజ్ఞమనబడునట్టిది. వేదములందు, స్మృతులందును గాయత్రీ మంత్రజపమునకు విశేష మహత్త్వము చెప్పబడినది. గాయత్రీ జపమును సర్వదా స్నానమాచరించి పరిశుద్ధుడు అయిన మీదటనే చేయవలెను. అటునిటు కదలుచు నడయాడుచు చేయరాదు. ప్రతిదినము గాయత్రీ మంత్రమును వేయి మాఱులుగా చేయుచున్నచో మానవుడు ఒక్క నెల రోజాలలో పాపవిముక్తిని పొందును. ఆ జపమును మూడు ఏండ్లవరకు అవిచ్ఛిన్నముగా సాగించినచో బ్రహ్మప్రాప్తి కలుగును. ఇది మనువు చెప్పిన మాట -

శ్లో. ఏతదక్షర మేతాం చ జపన్ వ్యాహృతిపూర్వికామ్
సంధ్యయోర్వేదవిద్విప్రో వేదపుణ్యేన యుజ్యతే.
(2-78)

ఈ 'ఓమ్' అను అక్షరముతోడను, వ్యాహృతితోడను జోడించి గాయత్రిని రెండు వేళల జపించునట్టి బ్రాహ్మణుడు వేదపఠనము వలన గలుగు పుణ్యఫలమును పొందును.

శ్లో. సహస్రకృత్వ స్త్వభ్యస్య బహిరేతత్త్రికం ద్విజః
మహతోఽప్యేనసో మాసాత్త్వచేవాహిర్విముచ్యతే.
(2-79)

ఈ మూడింటిని (అనగా ప్రణవము, వ్యాహృతి, గాయత్రి) వెలుపల అనగా ఏకాంత ప్రదేశమందు దినమునందు వేయి మాఱులుగా జపించుచున్నచో ఒక్క మాసము కాలమునందు బ్రాహ్మణుడు కుబుసము నుండి పాము విడివడు విధముగా మహాపాతకమునుండి విముక్తుడగును.

శ్లో. ఓం కారపూర్వికా స్తిస్రో మహావ్యాహృతయోఽవ్యయాః
త్రిపదా చైవ సావిత్రీ విజ్ఞేయం బ్రహ్మణో ముఖమ్.

(2-21)

ఓం కారముతోడను (భూః భువః స్వః అనబడు) మూడు వ్యాహృతులతోడను గూడినదై మూడు పదములు గల గాయత్రిని బ్రహ్మముఖమని యెఱుగవలెను.

శ్లో. యోఽధీతేఽహన్యహన్యే తాఁత్రీణి వర్షాణ్యతంద్రితః
స బ్రహ్మ పరమభ్యేతి వాయుభూతః ఖమూర్తిమాన్.

(2-82)

ఏ మానవుడు దినదినమును అలసత్వమును మాని ఓంకారము తోడను, వ్యాహృతులతోడను జోడించి గాయత్రీ మంత్రము నవిచ్ఛిన్నముగా మూడేండ్ల వరకు జపించునో వాడు వాయు రూపుడును, ఆకాశ రూపుడును అయి పరబ్రహ్మమును పొందును.

ఇక్కడొక్క విషయము మనము మఱవరాదు. అది యేమన ఉపనయనమై యజ్ఞోపవీతమును ధరించునంత వరకు ఒక్క క్షత్రియుడు, వైశ్యుడు మాత్రమే కాదు. బ్రాహ్మణుడు కూడ వేదాధ్యయనము కాని, వేదోక్తమైన హోమప్రక్రియను గాని సంధ్యా వందనము, గాయత్రీ జపమాదిగాగల వేదప్రతిపాదితములైన విధులను కాని ఆచరింపరాదు. యజ్ఞోపవీతమును ధరింపనినాడు బ్రాహ్మణునకు కూడ ఆ విధులను ఆచరించుటకధికారము లేదు. కాదని ఆచరించిన

వారు ప్రాయశ్చిత్తము చేసుకొనవలసినవారగుదురు. కాబట్టి బ్రాహ్మణులు, క్షత్రియులు వైశ్యులును తప్పక విధిపూర్వకముగా యజ్ఞోపవీతధారణము చేయవలయును. వ్రాత్యులు (పతితులు)గా పేరుపడినవారైనను కూడ శాస్త్రవిధిని అనుసరించి ప్రాయశ్చిత్తము చేయించుకొని యజ్ఞోపవీత ధారణము చేయవలయును.

(వ్రాత్యులనగా -

శ్లో. అత ఊర్ధ్వం త్రయో ఉ ప్యేతే యథాకాల మసంస్కృతాః
సావిత్రీపతితా వ్రాత్యా భవంత్యార్యవిగర్హితాః.

(2-39)

నిర్ణీతసమయములోపల బ్రాహ్మణ-క్షత్రియ- వైశ్యులన బడు మూడు వర్ణముల వారికి ఉపనయనములు జరగక కాలము మీఱిపోయినప్పుడు వారు సావిత్రీపతితులై వ్రాత్యులుగా పేర్కొన బడుచున్నారు. ఉపనయనకాలము విషయమున మనువు చెప్పిన మాట.

శ్లో. గర్భాష్టమేఉబ్దే కుర్వీత బ్రాహ్మణ స్యోపనాయనమ్
గర్భాదేకాదశే రాజ్ఞో గర్భాత్తు ద్వాదశే విశః.

(2-36)

గర్భగతుడు అయినది మొదలు బ్రాహ్మణునకు 8వ యేటను, క్షత్రియునకు 11వ యేటను, వైశ్యునకు 12వ యేటను ఉపనయనము చేయవలెను.

శ్లో. ఆషోడశాద్బ్రాహ్మణస్య సావిత్రీ నాతివర్తతే
ఆద్వావింశాత్క్షత్రబంధోరాచతుర్వింశతేర్విశః. (2-38)

బ్రాహ్మణునకు 16, క్షత్రియునకు 22, వైశ్యునకు 24 వర్షముల వరకును సావిత్రీ కాలము మీఱి పోక యుండును. అనగా ఆ పరిమితి దాటనంతవరకు వారుపనయనము చేసుకొనవచ్చును.

ఇంతవరకు ద్విజులగువారికి యజ్ఞోపవీత కర్మము, కాలము

తెలుపబడినది. ఇప్పుడు ఆచరింపదగు విషయములను వివరించుచున్నాము.

బాలకులారా! లోకములో ప్రేమ అన్నిటికన్న మిన్న యైనది. అది సాక్షాత్తు పరమాత్ముని స్వరూపము. కావున ప్రేమ ఎచ్చటనున్న అచ్చట శాంతి నెలకొనియుండును. ఆ ప్రేమ స్వార్థమును వీడి పరుల యాత్మకు సుఖము గలిగించుట వలన సిద్ధించును. కాబట్టి తల్లి, తండ్రి, గురుజనులు, (పెద్దలు) తనతో గూడి విద్యనభ్యసించువారును మాత్రమే కాదు. ఎల్లవారలతోడను, ఎల్లవేళలయందును సత్యమై, హితకరమై, వినయ యుక్తములైన మాటలు పలుకుచుండవలెను. మనసా, వాచా, కర్మణా ఏ విధముగా నైనను పరులకు మేలు గలిగించుటకు ప్రయత్నింపవలెను.

ఇతరుల వస్తువులను ఎన్నడును దొంగిలింపరాదు. లాగుకొనరాదు. ఇతరులేదైనను సంతోషముతో నిచ్చినను మీ స్వార్థము కొఱకు దానిని స్వీకరింపరాదు. సవినయముగా ప్రియవచనములాడి వారికి సంతోషము గలిగింపవలెను. వారిచ్చిన దానిని గ్రహింపకున్న వారికి ఇబ్బంది కలుగుటయు, ప్రేమానుబంధమునకాటంకము గలుగుటయు సంభవించునెడల ఆవశ్యకతను బట్టి స్వీకరించినను తప్పుగాదు.

ఇతరుల అవగుణములను పరిగణింపక వారి సుగుణములనే గ్రహింపవలెను. ఎవనిని నిందింపవలదు. ఒకనికి విరుద్ధముగా చాడీలు చెప్పవలదు. ఇట్టి చేష్టల వలన మీకుగాని, వారికి గాని మేలేదియు గలుగదు. ఆవశ్యకమైన చోట నిజమైన ప్రశంస చేయవచ్చును.

పేరు ప్రతిష్ఠలను, పెద్దరికమును ఎన్నడును కోరుకొనరాదు. కోరకుండగనే అవి ప్రాప్తించినప్పుడు కూడ వానిని మీ భవిష్యత్తున కవరోధములని యెఱిగి మానసికముగా స్వీకరింపకుండుట మంచిది. కాదని స్వీకరించినచో మనస్సులో దుఃఖమును సంకోచమును

కలుగును.

పరుల ఇచ్ఛానుసారముగా గాని, దైవేచ్ఛననుసరించి గాని మీ మనస్సునకిష్టముకాని వస్తువులు లేక పదార్థములేవైన ప్రాప్తించినప్పుడు కూడ వానిని భగవానుడు పంపిన పురస్కారము (బహుమానము) గా భావించి యానందమునే పొందవలెను. అట్లు కానినాడు చేసుకొన్న పాపముల ఫలము ఇది యని తలచి యోరిమి వహింపవలెను.

పెద్దలు చెప్పిన ప్రతిపనిని, ప్రతి ఆజ్ఞను విధిగా పాటింపవలెను. కాని ఆ యాజ్ఞలు వారికే కాని, ఇతరులకు గాని హాని గలిగించునట్టివో లేక భగవద్భక్తి మార్గమునకు అవరోధము గలిగించునట్టివో అయినప్పుడు మాత్రము వానిని మీరు ఉపేక్షింప వచ్చును.

పెద్దలతోనే కాదు. మఱి యెవ్వరితోడను కూడ నిరర్థకములైన చర్చలకును, వాదోపవాదములకును పూనుకొనరాదు.

ఎంతటి విపత్తు వచ్చి మీద పడినను చలింపక దానిని నిర్భయముగా ధైర్యముతో సహించుకొనవలెను. అట్లు సహించు కొనుచుండుట వలన క్రమముగా ఆత్మబలము పెంపొందును. కావున బాలకులారా! మీరు ఆపదలయందు ధైర్యమును, ధర్మమును విడువలదు.

ఒక మంచిపని చేసి యెన్నడును మనసులో అభిమాన మునకును అహంకారమునకు చోటియ్యరాదు. కాని ధనము, విద్య, బలము, ఐశ్వర్యము మున్నగునవి ప్రాప్తించినపుడు మనస్సులో దర్పాహంకారములు, అభిమానము పుట్టుకొని వచ్చుచుండును. వానిని మృత్యువుతో సమానమైనవని భావించుకొనవలెను. ఎల్లవారలతోడ దీనముగాను, సవినయముగాను మెలగుచుండవలెను. ఇట్లు చేసిననాడాదుర్గుణములు మీలో ప్రవేశింపజాలవు.

భగవద్గీత, రామాయణము, మున్నగు ధార్మిక గ్రంథములను మిక్కిలి శ్రద్ధాభక్తులతో పరిశీలించుటకై కూడ తప్పక నిత్యము కొంత సమయమును వినియోగించుచుండవలెను.

పైన వివరించిన సదాచారవిధులను పాటించుచుండుటవలన మానవునిలోని దుర్గుణములు, దుర్వృత్తులు అన్నియు నశించిపోవును. మనస్సులో సహజముగనే క్షమ, దయ, శాంతి, తేజస్సు, సంతోషము, సమానత, జ్ఞానము, శ్రద్ధ, ప్రేమ, వినయము, పవిత్రత, చల్లదనము, శమము, దమము, మున్నగు సద్గుణములెన్నియో పుట్టుకొని వచ్చును. ఏల యనగా బీజమువలన వృక్షము, వృక్షము వలన బీజమువలె సద్గుణముల వలన సదాచారము, సదాచారము వలన సద్గుణములును వృద్ధి పొందుచుండును. మఱియు దుర్గుణములు, దురాచారములును అంతరించి పోవుచుండును.

కావున నాయనలారా! సద్గుణములను పెంపొందించు కొనుటకును, సదాచారములను పాటించుటకును సర్వదా తత్పరతతోడ పూనుకొను చుండుడు! అట్లు చేయుచుండుటవలన మీకిహమునందు, పరమునందును కూడ సుఖము, శాంతి చేకూరగలదు.

---

# సంయమము

సంయమమనగా అదుపు. మనస్సును, బుద్ధిని ఇంద్రియముల నదుపులో నుంచుకొనవలసిన ఆవశ్యకత మనకెంతయో యున్నది. అట్టి అదుపును పాటింపనినాడు అవి మానవుని తప్పక పతితుని

గావించును.

శ్లో. యతతో హ్యాపి కౌంతేయ! పురుషస్య విపశ్చితః
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః. (2-60)

భగవానుడర్జునునితో చెప్పినమాట - అర్జునా! బలముగా మథించే స్వభావము గల తన యింద్రియములను అదుపులో పెట్టుకొనుటకు ఎంతయో ప్రయత్నించు బుద్ధిమంతుడైన పురుషుని మనస్సును కూడ అవి మథించివైచి హరించివేయగలవు.

ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽను విధీయతే
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి (గీ:2/67)

నీటిలో ప్రయాణించు నావను వాయువెట్లు హరించుకొనిపోవునో, అట్లే విషయాలలో చరించు ఇంద్రియాలలో, ఏ యింద్రియము మనస్సుతో కూడియుండునో, ఆ ఒక్క యింద్రియమే ఈ అయుక్తుడగు పురుషుని బుద్ధిని హరించుకొనిపోవు సుమా!

శ్లో. ఇంద్రియాణాం తు సర్వేషాం యద్యేకం క్షరతీంద్రియమ్
తేనాస్య క్షరతి ప్రజ్ఞా దృతేః పాదాదివోదకమ్.(మను 2-99)

ఇంద్రియములు అన్నిటియందు ఏ ఒక్కటి చలించినను దానివలననే బుద్ధి చిల్లులున్న పాత్రలోని నీటివలె దిగజారిపోవును.

అంతఃకరణమునదుపుచేయుట శమమనబడును. ఇంద్రియముల నదుపుచేయుట దమమనబడును. ఈ శమదమాదులను స్మృతికర్తలు ధర్మమునకు అంగములుగా భావించియున్నారు. వీనిని బ్రాహ్మణుని స్వాభావిక కర్మలుగా భగవద్గీత చెప్పినది. సాధనాంగమని వేదాంతము తెలుపుచున్నది.

వశీకరించుకొనబడిన యింద్రియములు, మనస్సు మిత్రముల వంటివి. వశీకరింపబడనినాడు శత్రువుల వంటివి. మోక్షమును పొందుటకు గాని, బంధనములో చిక్కుకొనుటకు గాని ఇవియే

ప్రధాన కారణములగునట్టివి. వశీకరింపబడినప్పుడివి ముక్తిని గలిగించును. కానినాడు దుఃఖజనకములైన బంధనములలోనికి పడద్రోయును. పల్లమునకు పాఱుట నీటి స్వభావము. అట్లే ఆసక్తి కారణముగా విషయముల వంకకు పరుగులు దీయుట యింద్రియముల స్వభావము. విషయములతోడ సంపర్కము వలన దురాచారము, దుర్గుణాలు పెచ్చుపెరిగి మానవుడు పతనమును పొందును. ఈ విషయమున మనువు చెప్పిన మాటలను కూడ గమనింపుడు -

శ్లో. ఇంద్రియాణాం ప్రసంగేన దోష మృచ్ఛత్యసంశయమ్
సంనియమ్య తు తాన్యేవ తత స్సిద్ధిం నియచ్ఛతి. **(2-93)**

మానవుడదుపులేకుండ వెంటపడినచో దోషమును పొందును. అదుపును పాటించినచో సిద్ధిని పొందును.

సారాంశమేమన ఇంద్రియములతోడ విషయముల సంపర్క మన్నదే ఎల్ల అనర్థములకును మూలకారణము. కావున నాయనలారా! ఈ విషయభోగములన్నియు నశించిపోవునవి, క్షణ భంగురములైనవి, దుఃఖదాయకములయినవని యెఱిగి వానిని విడిచిపెట్టుటకు యత్నింపుడు!

'విషయభోగములపై కోరికయున్న మానవుడు వానిని తనివి తీరునట్లు అనుభవించివేయుట మంచిది. అనుభవింపగా ఆ కోరిక సహజముగనే శాంతించిపోవును' అని కొందఱు సోదరులు వాదింతురు. కాని యీ వాదము యుక్తమైనది కాదు. ఆ విషయమున మనువు ఏమి చెప్పెనో చూచితిరా -

శ్లో. న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే. **(2-94)**

భోగకాంక్షలనేక విధములు. అనుభవించుట చేత అవి శాంతింపవు. నేయి పోసిన అగ్నివలె అవి అనుభవించుకొలది మఱింత

పెచ్చురిల్లును.

విషయభోగములందే శాంతి, సుఖమున్నదని ఎందఱో భావించుచుందురు. కాని అది వారి భ్రాంతి. మిడుతలకు వెలుగుచున్న దీపము మున్నగువానియందే సుఖము, శాంతి గోచరించును. కాని వానియందు అది లేదనే యెఱుగక అవి యందుపడి నాశనమును పొందుచుండును. అట్లే లోకసంబంధమైన విషయభోగములందు మానవునకు కూడ క్షణికములైన శాంతి సుఖములు గోచరించును. కాని ఆ విషయములతోడ సంపర్కమన్నది, మానవుని నాశనమునకు, పతనమునకు దారితీయుట తథ్యము. కాబట్టి వివేకముతోగాని, విచారణ మూలకముగా కాని, భయవశమున గాని, పంతగించి కాని ఏ విధముగనైనను మనస్సును, ఇంద్రియములను విషయ భోగముల నుండి వెనుకకు మఱలించుటకు నడుము కట్టి ప్రాణములొడ్డియైన కృషి చేయుడు! ఆ కృషి యావజ్జీవము సాగించుచుండవలసినదే. ఇదిగో! ఇక్కడ మనువు ఏమనెనో పరికింపుడు !-

శ్లో. ఇంద్రియాణాం విచరతాం విషయేష్వపహారిషు
సంయమే యత్నమాతిష్ఠే ద్విద్వాన్ యంతేవ వాజినామ్.
(2-88)

విషయములు మానవుని మనస్సును హరించివేయునట్టివి. ఆ విషయములయందు ప్రవర్తిల్లునట్టి యింద్రియములను గుఱ్ఱములను అదుపు చేయుటకు ప్రయత్నించు సారథివలె నిరోధించుటకు నిరంతరము ప్రయత్నించుచుండవలయును.

శ్లో. వశే కృత్వేంద్రియగ్రామం సంయమ్య చ మనస్తథా
సర్వాన్ సంసాధయేదర్థానక్షిణ్వన్ యోగతస్తనుమ్.
(2-100)

ఇంద్రియములను వశముజేసుకొని, మనస్సును నిరోధించు

కొని, యోగసాధనచే శరీరమును పీడింపక ధర్మ - అర్థ - కామ - మోక్షములనబడు పురుషార్థముల నన్నిటిని సాధించు కొనుట మానవుని కర్తవ్యము.

కావున బాలకులారా! మీరు ముందుగా వాక్కును, ఇంద్రియ ములను, పిమ్మట మనస్సును అదుపు చేయుటకు ప్రయత్నింపుడు. (గీత - 3/41-43)

ఏ మానవుడైన మిమ్ము నిందించినను లేక దూషించినను అదే పని తిరిగి మీరు చేయరాదు. అందులకు బదులుగా మీరు శాంతముగా వానితో సత్యము, ప్రియము, హితకరము, కోమలము నగుమాట లాడుడు! ఏలయనగా ఆ నింద నిజమైనదైనచో దానివలన మీకు హాని యేదియు కలుగక పోవుటయే కాక అది మీ సుగుణాలను కప్పిపుచ్చును. అది ఒక విధముగా ఉపకారమే యగును. ఎవడైన మీతో కొట్లాటకు దిగవచ్చును. లేదా మీ వస్తువులను వేనినైన హరింపవచ్చును. లేదా బలప్రయోగము చేసి లాగుకొనవచ్చును. లేదా మీ తోడ అనుచితముగా వ్యవహరింపవచ్చును. ఇట్టి సందర్భములందు మీరు సహనమునే వహింపవలయును. కాని రెచ్చిపోవరాదు. మీరు పూర్వము చేసియున్న దోషములకు ఫలముగా భగవంతుడు ఈ పరిస్థితిని కలిగించెనని తలచుకొని మానసికముగా ప్రసన్నత వహింపుడు. ఏదియో ఒక అపరాధము చేసియుండనివాడును, భగవానుని ప్రేరణ లేనివాడును ఎవ్వడును, ఎవ్వనికి ఎట్టి యనర్థమును గలిగింపజాలడు.

సహనము వలన ధైర్యము, గాంభీర్యము, వీరత్వము, ఆత్మబలమును పెంపొందును. సహనమన్నది క్షమాబుద్ధివలన గలుగవలయును. కాని పిరికితనము, భయమువలన గలుగరాదు. ఏమియు చేయజాలని దశలో చూపిన క్షమ క్షమ గాదు. సహనము సహనము గాదు. ఆత్మరక్షణ కొఱకుగాని, ఒక అన్యాయమును

నిరోధించుటకుగాని అవశ్యకతననుసరించి తగిన ప్రతీకారమునకు యత్నించుటలో తప్పులేదు. కాని ఒక్క విషయము మాత్రము గుర్తుంచుకొనవలసియున్నది. అదేమన మీ వలన ఎవరికిని ఎట్టి చేటును గలుగరాదు. ఇక్కడ మనువు ఏమని చెప్పెనో చూడుడు -

శ్లో. నారున్తుదః స్యాదార్తోఽపి న పరద్రోహకర్మధీః
యయాస్యోద్విజతే వాచా నాలోక్యాం తాముదీరయేత్.
(2-161)

ఏ కష్టమైన తనకితరుల వలన గలిగినప్పుడు కాని, దైవ వశమున ప్రాప్తించినప్పుడు కాని మానసికముగా దుఃఖమును పొందరాదు. ప్రతీకారముగా పరులకు ద్రోహము చేయ యత్నింపరాదు. పరులకు దుఃఖమును గలిగించునట్టి లోకవిరుద్ధమైన పలుకులనెన్నడును పలుకరాదు.

శ్లో. సమ్మానా ద్బ్రాహ్మణో నిత్య ముద్విజేత విషాదివ
అమృతస్యేవ చాకాంక్షేదవమానస్య సర్వదా. (2-162)

బ్రాహ్మణుడు విషమునకు వెఱచు విధముగా సమ్మానమునకు భయపడవలెను. (ఏలయనగా దానివలన యభిమానము, అహంకారమును పెరిగి పతనావస్థకు మార్గము ఏర్పడును.) అవమానమును అమృతము వలె ఆకాంక్షింపవలెను. అనగా తిరస్కారము ప్రాప్తించినను ఖేదమును పొందరాదు.

శ్లో. సుఖం హ్యవమత శ్శేతే సుఖం చ ప్రతిబుధ్యతే
సుఖం చరతి లోకేఽస్మిన్నవమన్తా వినశ్యతి. (2-163)

అవమానమును భరించువాడు సుఖముగా నిద్రించును. సుఖముగ మేల్కాంచును. సుఖముగా లోకములో చరించును. కాని పరులనవమానించువాడు నశించిపోవును.

కావున పరులకనర్థమును గలిగించుటకాని, పరులతో వైరము

వహించుటకాని, పరులను ద్వేషించుటయు, ఏవగించుకొనుటయును గాని తన పతనమును తాను కోరితెచ్చుకొనుటయే యగును.

పెండ్లి కానంతవరకు బాలకుడు తల్లిదండ్రుల చెంత నున్నను, గురువు చెంత నున్నను బ్రహ్మచారిగానే పరిగణింపబడును.

బ్రహ్మచారి ఉల్లిపాయ, మద్యము, మాంసము, భంగు, పుగాకు, బీడి, సిగరెట్లు, గంజాయి మున్నగు హేయములైన మత్తుపదార్థములను సేవించుట మాట యటుంచి వానిని కలలో కూడ తలపెట్టరాదు.

సెంట్లు, అత్తరువులు, సుగంధతైలాలు, పూలదండలు, కంటి అంజనములు, తలల శృంగారములు, నాట్య, గాన, వాద్యములు స్త్రీలను దర్శించుట, వారితో మాటలాడుట, వారిని స్పృశించుట, వారివెంట సినిమాలకు అరుగుట, ఆటపాటలవంటి వినోదములలో పాల్గొనుట వంటి చేష్టలను బ్రహ్మచారులు పూర్తిగా విసర్జింపవలెను. కారణము ఏమన దానివలన అనేక అనర్థములు వాటిల్లును. కామోద్రేకము గలుగును. వీర్యక్షయము సంభవించును.

కల్లకపటము ఛిద్రాన్వేషణము, జూదము, జగడము, వివాదము, పరనింద, చాడీలు చెప్పుట, హింస, చౌర్యము, వ్యభిచారము మున్నగువానిని మహాపాతక హేతువులుగా భావించి పూర్తిగా విడనాడవలెను.

కామక్రోధలోభ మోహాదులను, రాగద్వేషములను, వైరమును, ఈర్ష్యాహంకారములను, దంభము, దర్పము, అభిమానము, హేయభావము మున్నగు దుర్గుణములను, ఇతరములగు అనేక పాపప్రవృత్తులను మహాపాతక హేతువులనియు మహాదుఃఖ దాయకములనియు ఎఱిగి వానిని మనస్సులో నుండి తొలగించు కొనుటకు నిరంతరము ప్రయత్నము చేయుచుండవలెను.

బాలురను, బ్రహ్మచారులను గూర్చి మనువు ఏమి చెప్పెనో

చూడుడు –

శ్లో. వర్జయేన్మధు మాంసం చ గంధం మాల్యం రసాన్ స్త్రియః
శుక్తాని యాని సర్వాణి ప్రాణినాం చైవ హింసనమ్.
(2-177)

మధు మాంసములు, సుగంధ ద్రవ్యములు, పూలదండలు, రసవములు, (రుచులు), స్త్రీలు, పులికడుగువంటి పులిసిన పానీయములు, జీవహింస – మొదలగువానిని వీడవలయును.

శ్లో. ద్యూతం చ జనవాదం చ పరివాదం తథానృతమ్
స్త్రీణాం చ ప్రేక్షణాలంభముపఘాతం పరస్య చ. (2-179)

జూదము, దూషణ, నింద, అసత్యము, స్త్రీలను చూచుట, కౌగిలించుకొనుట, పరులను తిరస్కరించుట – అనబడు ఈ అవలక్షణములన్నిటిని బ్రహ్మచారి పరిత్యజింపవలెను.

శ్లో. అభ్యంగమంజనం చాక్ష్ణోరుపానచ్ఛత్రధారణమ్
కామం క్రోధం చ లోభం చ నర్తనం గీతవాదనమ్.
(2-178)

నలుగు పెట్టుకొనుట (తలంటు సందర్భము) కన్నులకు అంజనము పెట్టుకొనుట, చెప్పులు, గొడుగు ధరించుట, కామ – క్రోధ – లోభవములు గలిగియుండుట, నాట్యవము, గానవము, వాద్యములయందు పాల్గొనుట – అనబడు వీనిని కూడ విడనాడ వలెను.

ఎంగిలి దోషము ఉన్న కారణముగా సోడావాటరు, కోడిగ్రుడ్లు కలువబడిన కారణముగా బిస్కట్లు, మద్యమాంసాదుల మేళవింపబడిన కారణముగా డాక్టర్లు ఇచ్చు మందులు, మద్యమాంసాదుల సంపర్కము కారణముగా హోటలు భోజనమును మిక్కిలి అపవిత్రములైనవి. వానిని కూడ ధర్మమునకు ప్రతిబంధకములుగా భావించి పరిత్యజింపవలెను.

ఇట్టి భోజనము తామస భోజనముగా భగవానుడు తెలిపియున్నాడు.

శ్లో. యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్
ఉచ్ఛిష్ట మపి చామేధ్యం భోజనం తామసప్రియమ్.

(గీత 17-10)

సగము పక్వమైనది, రసరహితమైనది (రుచిలేని) దుర్గంధ భరితమైనది, ఎక్కువ కాలము నిలువయున్నది, ఎంగిలి చేయబడినది, అపవిత్రమైనదియును అగు భోజనము తామసులకు ఇష్టమగు భోజనము.

పైన పేర్కొన్న అవలక్షణములను విడనాడని మనుజుడు చేయు యజ్ఞము, తపము, దానము, నియమము, మున్నగు ఉత్తమ కర్మలేవియు సఫలములుగావు. మనువు ఏమనెనో చూడుడు!

శ్లో. వేదా స్త్యాగశ్చ యజ్ఞాశ్చ నియమాశ్చ తపాంసి చ
న విప్రదుష్టభావస్య సిద్ధిం గచ్ఛంతి కర్హిచిత్. (మనువు 2-97)

దుష్టస్వభావుడైన మనుజుని వేదాధ్యయనము, దానము, యజ్ఞము, నియమములు, తపస్సులు, ఎన్నటికి సిద్ధింపవు. ఉత్తమ ఫలమునొసగవు.

శ్లో. దురాచారో హి పురుషో లోకే భవతి నిందితః
దుఃఖభాగీ చ సతతం వ్యాధితోఽల్పాయురేవ చ.

(మను : 4-157)

దురాచార పరాయణుడైన పురుషుడు సర్వదా లోకనిందను పొందును. దుఃఖభాజనుడగును. వ్యాధిగ్రస్తుడు, అల్పాయుష్కుడగును.

కావున దుర్గుణాలను, దురాచారములను వీడి మనుజుడు తన మనస్సును, ఇంద్రియములను విషయముల వంక పోకుండ నిరోధించి అదుపులో నుంచుకొనవలెను. అట్లదుపును పాటించుటవలన రాగద్వేషములు, సుఖదుఃఖాదులు అంతరించును. ఎప్పుడు మీకు

ప్రియమైన వస్తువు ప్రాప్తించినప్పుడు సంతోషము అప్రియమైనది ఏదైన ప్రాప్తించినప్పుడు దుఃఖము కాని కలుగకుండునో, మీ మనస్సు, ఇంద్రియములు విషయములతోడ సంపర్కమును పొందినప్పుడు మీ చిత్తములో వికారముదయింపకుండునో అప్పుడు మిమ్ము నిజమైన జితేంద్రియునిగా ఎన్నవచ్చును. ఇక్కడ మనువు ఇటుల చెప్పెను-

శ్లో. శ్రుత్వా స్పృష్ట్వా చ దృష్ట్వా చ భుక్త్వా ఘ్రాత్వా చయోనరః
న హృష్యతి గ్లాయతి వా స విజ్ఞేయో జితేంద్రియః.
(2-98)

అనగా ఒక మాట విని కాని, ఒక దృశ్యమును చూచికాని, దేనినైన స్పృశించి కాని, తిని కాని, (అనుభవించికాని) ఆఘ్రాణించి కాని ప్రసన్నతను కాని, అప్రసన్నతను కాని, ఎవడు పొందకుండునో వానినే జితేంద్రియునిగా ఎన్నవలెను.

మనస్సును, ఇంద్రియములను వశీకరించుకొన్న మీదట, రాగద్వేషములు సమసిపోయిన మీదట మాత్రము విషయములతో సంబంధము కలిగియుండుట లాభకరమగును. భగవానుడు కూడ భగవద్గీతలో -

శ్లో. రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియై శ్చరన్
ఆత్మవశ్యైర్విధేయాత్మ ప్రసాద మధిగచ్ఛతి. (గీత 2-64)

అని చెప్పియున్నాడు. అనగా - అంతఃకరణమును వశీకరించుకొన్నవాడు రాగద్వేషవిరహితుడై వశీకరింపబడిన తన యింద్రియముల ద్వారా విషయములను అనుభవించుచు చిత్తమునందు ప్రసన్నతను, పవిత్రతను బడయుచుండును.

– – –

# బ్రహ్మచర్యము

మైథునములు అనేక విధములు.

శ్లో. స్మరణం కీర్తనం కేళిః ప్రేక్షణం గుహ్యభాషణమ్
సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియానిష్పత్తిరేవ చ.

స్త్రీని స్మరించుట, స్త్రీ సంబంధమగు సంభాషణను చేయుట, స్త్రీలతో క్రీడించుట (ఆడుట), స్త్రీని దర్శించుట, ఆమెతో రహస్యముగా మాటలాడుట, ఆమెను కలియుటకు సంకల్పించుట, అందులకై ప్రయత్నము చేయుట, ఆమెతో సంగమము చేయుట - ఇవి యన్నియు మైథునవిధములే.

ఇట్టి మైథున ప్రకారములనన్నిటిని విసర్జించినవాడు బ్రహ్మచారి యనబడును. కారణమేమనగా అన్నివిధముల వీర్యమును కాపాడుకొనురూపములో సాగింపబడు బ్రహ్మచర్యమే బ్రహ్మప్రాప్తికి ప్రథానహేతువు. ఈ నియమమును పాటించువాడు తల్లిదండ్రుల చెంతనున్నను బ్రహ్మచారియే, గురుని సన్నిధానములో నున్నను బ్రహ్మచారియే యగును. బాలకులారా! ఈ బ్రహ్మచర్య వ్రతమును పాటించుట మీకు కూడ పరమకర్తవ్యమే. దీని వలన మీకు బలము, బుద్ధి, తేజస్సు, సద్గుణములు, సదాచారమును పెంపొంది కడకు పరబ్రహ్మప్రాప్తి సిద్ధించును.

కావున మీరు స్త్రీ సంబంధమునకు బహుదూరముగా ఉండుడు! స్త్రీలను దర్శించుట, వారితో సంభాషించుట, వారిని స్పృశించుట, చింతనము చేయుట వంటి చేష్టలను మానుట మాత్రమే కాదు, వారి మూర్తిని, చిత్తరువును కూడ బ్రహ్మచారి చూడరాదు. తప్పనిసరియైనప్పుడు వారి పాదముల వంకకో, నేలవంకకో చూచుచు

వారిని తల్లిగానో చెల్లిగానో భావించుచు వారితో సంభాషించవలెను. కాని ఏకాంతమందు తల్లితోను, చెల్లితోను కూడ యుండరాదు. కారణము ఏమన్న స్త్రీలతోడ సంబంధము ప్రాప్తించినప్పుడు బుద్ధిమంతుడైనవాని బుద్ధి కూడ భ్రష్టమైపోవును. ఇంద్రియములు చలించిపోవును. ఇక్కడ మనువు ఏమని చెప్పెనో పరికించితిరా -

శ్లో. మాత్రా స్వస్రా దుహిత్రా వా న వివిక్తాసనో భవేత్
బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి. **(2-215)**

తల్లితోడను, చెల్లితోడను, కొమరితతోడను కూడ కలిసి పురుషుడు ఏకాంత ప్రదేశమందుండరాదు. ఏలయనగా ఇంద్రియ సమూహము ఎంతయో బలవంతమైనది. అది పండితుడైన వానిని కూడ ఆకర్షించి భ్రష్టుని చేయగలదు.

బ్రహ్మచర్య వ్రతపాలన విషయమున హనుమంతుడు సుప్రసిద్ధుడు. అతని చరిత్ర రామాయణ పఠనము చేయు వారందఱికును పరిచితమైనది. అతడొక అలౌకిక మహావీర పురుషుడు. అతడు సముద్రమును లంఘించెను. రావణుని కొడుకగు అక్షయ కుమారుని సంహరించెను. లంకను కాల్చెను. సీతాదేవి సమాచారమును శ్రీరామచంద్రునకందించెను. శక్తి బాణము తగిలి లక్ష్మణుడు మూర్ఛిల్లినప్పుడు సుషేణుడను వైద్యుడొక మూలిక యేదియో చెప్పగా అతడు పోయి ఆ మూలికను గుర్తింపలేక అదియున్న కొండనే పెకిలించి సూర్యోదయము కాకముందుగనే లంకలోనికి కొనివచ్చెను. రామాయణములోని కిష్కింధాకాండమును, సుందరకాండమును పరిశీలింపగా తెలియవచ్చు విషయము ఏమన - హనుమంతుడు కేవలము వీరుడు మాత్రమే కాదు. సదాచారపరాయణుడు. విద్వాంసుడు. బుద్ధిసిద్ధులను ఎఱిగినవాడు. గొప్ప భగవద్భక్తుడు. అతని మహత్త్వమును కొనియాడుచు స్వయముగా భగవానుడగు

శ్రీరామచంద్రుడు - హనుమా! నీవు చేసిన సేవకు బదులుగా నీకు నేను ఎట్టి ప్రత్యుపకారమును చేయలేనివాడనైన కారణమున సిగ్గుపడుచున్నాను - అని చెప్పియుండెను.

నేటికిని భారతీయులు అతనిని నైష్ఠిక బ్రహ్మచారియన్న భావముతో పూజించుచున్నారు. స్తుతించుచున్నారు. వ్యాయామము చేయువారు తమ సంఘములకు, మహావీరదళము అని పేరు పెట్టుకొని తమ బలమును పెంపొందించుకొనగోరుచున్నారు. నిజమరయగా మానవుడు హనుమంతుని యే గుణమును విశేషముగా అభిమానించి స్మరించుచుండునో దాని యంశవముగా ఆ గుణము వానిలో ఆవిర్భవించునా? అని యనిపించును.

ఇక లక్ష్మణుని విషయము నాలోచింపుము. అతడు రాజ కుమారుడు, వీరుడు, సాక్షాత్తు భగవానుని సేవకుడు. ఆదిశేషుని యవతారము. అతడు శ్రీరామచంద్రునితోడ జన్మించి లోకకల్యాణము కొఱకు, లోకమర్యాదను రక్షించుటకు ఆదర్శప్రాయుడుగా వ్యవహరించెను. అతడు సదాచారపరాయణుడని, శుభగుణరాశియని, భగవానుని పరమభక్తుడని, మహావీరుడనియు ప్రసిద్ధిని పొందెను. ఇంద్రుడు కూడా సంహరింపజాలని మేఘనాథుని అతడు సంహరించెను. ఆవశ్యకత కలిగినప్పుడు అతడు యమునికి కూడ వెఱచువాడుగాడు. ఇది యంతయు అతనికెట్లు సాధ్యమయ్యెను? అతడు పాటించిన బ్రహ్మచర్యవ్రతము యొక్క ప్రభావము వలననేయని మనమెఱుగవలెను.

ఇక గంగా పుత్రుడు భీష్మపితామహుడున్నాడు. అతని పేరు మీరు వినియేయుందురు. అతడు మహాతేజశ్శాలి. సౌశీల్యవంతుడు. భగవద్భక్తుడు. అఖండ బ్రహ్మచర్యమును పాటించినవాడు. ధర్మాత్ముడు. మహావీరుడు. అతడు తన తండ్రిని సేవించుటకై

క్షణములో కాంచనమును (బంగారము) కామినిని పరిత్యజించివైచెను. తన పరాక్రమముతో కాలుని (మృత్యువును) కూడా నిర్జించెను. అతనికి దేవవ్రతుడని మఱియొక పేరున్నది. అతడు ఒకనాడు తన తండ్రిని చింతాక్రాంతునిగా చూచి కారణమడిగెను. ఆ తండ్రి తాను సంతానవృద్ధికై మఱియొక పెండ్లి చేసుకొన నెంచుచుంటినని బదులు పలికెను. అనంతరము దేవవ్రతుడు తన తండ్రియొక్క వృద్ధమంత్రి చెంతకు పోయి అతనిని కూడ తన తండ్రి దుఃఖమునకు కారణమేమని ప్రశ్నించెను. అప్పుడు ఆ మంత్రి నాయనా! నీ తండ్రికి ఒక పల్లెవాడు తన పిల్లనిచ్చుటకేవియో షరతులు పెట్టెనని యెఱుగజెప్పెను.

అంతట దేవవ్రతుడు కొందఱు క్షత్రియులను వెంట నిడుకొని యా పల్లెవాని చెంతకు బోయి తన తండ్రికి పిల్లనిమ్మని యతనిని ప్రార్థించెను. అప్పుడు పల్లెవాండ్రనాయకుడు దేవవ్రతుని తగురీతిని గౌరవించి యిట్లు పలికెను. 'నాయనా! నీ తండ్రికి నీవు పెద్ద కుమారుడవు. రాజ్యాధికారమును గ్రహించునట్టి య్యర్హతగలవాడవు. కాని నేనాడుబిడ్డ తండ్రిని. నేనొక్కమాట చెప్పదలచుకొన్నాను. అది యేమన నా కుమార్తెకు కలుగు బిడ్డకే రాజ్యాధికారము ప్రాప్తించ వలయును. ఈ షరతునకు సమ్మతి దెలిపినచో నా కొమరితను నీ తండ్రికిచ్చి వివాహము జరిపించెదను. లేకున్న వివాహప్రసంగము లేదు.' దాశరాజు (కన్యతండ్రి) ఆడిన యీ మాటలనాలకించి దేవవ్రతుడు తన వెంటనున్న రాజన్యులందఱి సమక్షమున దాశరాజా! నీ షరతునకు నేను సమ్మతిని దెలుపుచున్నాను. ఈ నా మాట సత్యము. ఇది నా నిశ్చయము. నీ కొమరితకు గలుగు బిడ్డయే రాజ్యాధికారి కాగలడని తన యభిమతమును ప్రకటించెను.

అంతట దాశరాజు మఱల – "నాయనా! దేవవ్రతా! ఈ రాజన్యులెల్లరి సమక్షమున నీవు నా కొమరిత కొఱకు కఠోర ప్రతిజ్ఞ

గావించితివి. అది నీ మహత్త్వమునకు తగియున్నది. నీవు ఆ మాటపై నిలచువాడవనుటలో నాకెట్టి సందేహమును లేదు. కాని ముందు ముందు నీకు గలగబోవు సంతానము నా బిడ్డయొక్క బిడ్డనుండి రాజ్యమును హరించివేయుదురేమోయని నా మనము శంకించుచున్నది. అని తన సందేహమును వెల్లడించెను. అప్పుడు దేవవ్రతుడెట్లులైన తన తండ్రి కోరికను దీర్పనెంచి మఱియొక ప్రతిజ్ఞ చేయుచు ఇట్లు పలికెను. – ''దాశరాజా! నేను నాతండ్రి కోరికను దీర్చుటకై యీ రాజన్యులందఱిముందు మరియొక మాట చెప్పుచున్నాను. వినుము! నేను రాజ్యాధికారమును ముందుగానే వీడితిని గదా! ఇక ఈ నాటినుండి బ్రదికియున్నంతకాలము వివాహము మాని బ్రహ్మచర్యమును పాటింతునని నీకు మాట యిచ్చుచున్నాను''.

అటు పిమ్మట దాశరాజాకొమరితతో అమ్మా! రథమును ఎక్కుమమ్మా మనము ఇంటికి వెడలుదమని యామెను రథముపై నెక్కించుకొనిపోయి హస్తినాపురమునందున్న తన తండ్రికర్పించెను. అతని యీ సాహసకృత్యమును గాంచి యెల్లవారును అతనిని మిక్కిలి కొనియాడుచు ఇతడు భయంకర కృత్యమునాచరించినవాడు. కావున ఇటుపై వీనిని భీష్ముడని పేర్కొందుమని పలికిరి. మహారాజా శంతనుడు తనకుమారుడు చేసిన పనికి పరమానందమును పొంది తన తపశ్శక్తి చేత అతనికి స్వేచ్ఛామరణమును వరముగా ప్రసాదించుచు అతనితో ''నాయనా! దేవవ్రతా! నీవు ఈ భూమిమీద ఎంత వరకు జీవించియుండగోరిన అంతవరకు మృత్యువు నిన్నేమియు చేయజాలదు. నీవు కోరినప్పుడే నీకు మరణము ప్రాప్తించగలదు అని పలికెను.''

(మహాభారతము – ఆదిపర్వము 100 వ అధ్యాయము)

ఆ కాలములో కాశీరాజునకు అంబ, అంబిక, అంబాలిక

అనుముగ్గురు కొమరితలుండిరి. వారికి ఆరాజా స్వయంవరమును ప్రకటించెను. అప్పుడు ఆజీవన బ్రహ్మచర్యదీక్షా ప్రభావమున అఖండతేజశ్శాలియై ప్రకాశించుచున్న భీష్ముడు తన సోదరుడగు విచిత్రవీర్యునకిచ్చి పెండ్లి చేయు తలంపున ఆ స్వయంవర స్థలమునకరిగి అచ్చటి రాజులందఱను యుద్ధములో జయించి ఆ కన్యలను ముగ్గురను కొనితెచ్చెను. వారిలో అంబ అను నామె తాను సాల్వరాజును ప్రేమించుచున్నాను అని పలుకగా ఆమెను ఆరాజా దగ్గఱకు పంపివైచెను. పరునిచేత గొనిపోబడిన నిన్ను నేనొల్లను అని సాల్వరాజా ఆమెను తిరస్కరించెను. అప్పుడామె భీష్ముని కడకు మఱల తిరిగి వచ్చి తనను పెండ్లియాడుమని అతనినే కోరుచు పట్టుపట్టెను. అతడు నిరాకరించెను. అప్పుడామె అతని గురువగు పరశురాముని శరణు పొందెను. ఆమె కోరికనుదీర్చుటకు ఆ పరశురాముడు భీష్మునితో చాలా దినములు పోరాటమును సాగించెను. కడకు భీష్ముడతనిని ఓడించి తన ప్రతిజ్ఞను నిలుపుకొనెను.

భీష్ముడు కేవలము శూరుడు, వీరుడు మాత్రమే కాదు. అతడు గొప్ప సదాచారపరాయణుడు. సద్గుణ సంపద గలవాడు. శాస్త్రపరిజ్ఞానములో సూర్యభగవానునంతటివాడు. భక్తులలో అగ్రగణ్యుడు. అతడు శ్రీకృష్ణుని ప్రోత్సాహముతో ధర్మరాజునకు భక్తిజ్ఞానము, సదాచారము మున్నగు ధార్మికవిషయములను గూర్చి అలౌకికమైన ఉపదేశము చేసెను. ఈ యుపదేశమంతయు శాంతిపర్వమునందు, అనుశాసనపర్వమునందున్నది. ఆజీవన బ్రహ్మ చర్యపాలనముయొక్క ప్రభావము చేత అతడు లోకములో అచంచల మగు కీర్తిని, స్వేచ్ఛామరణమును పొంది కడపట సర్వోత్కృష్టమైన పరమపదమును పొందెను.

బ్రహ్మచర్యము యొక్క మహత్త్వమును వివరించుచు

భగవానుడు గీతలో ...

శ్లో. యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే. (8-11)

అని చెప్పియున్నాడు. అనగా ఏ పరమపదమును కాంక్షించుచు బ్రహ్మచారులు బ్రహ్మచర్యపాలనము చేయుచున్నారో దానిని నీకు సంగ్రహముగా వివరించుచున్నాను. అని భావము.

ఇట్టి వివరణయే కఠోపనిషత్తులో కూడ కానవచ్చుచున్నది.

శ్లో. యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
తత్తేపదం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్. (1-2-15)

అనగా దేనిని కోరి పరమపదమును గూర్చి సంగ్రహముగా వివరించుచున్నానో, ఆ పదము 'ఓమ్' అనునది.

శ్లో. ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరం పరమ్
ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్యతత్.
(కఠోప. 1-2-16)

ఈ 'ఓమ్' అను అక్షరమే సగుణబ్రహ్మము. అదియే నిర్గుణ పరమబ్రహ్మముకూడ. ఈ ఓమ్ అను అక్షరమునే యెఱిగి మానవుడు ఏదికోరిన దానిని పొందును.

శ్లో. ఏతదాలంబనం శ్రేష్ఠమేతదాలంబనం పరమ్
ఏత దాలంబనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే.
(కఠో. 1-2-17)

ఇది యన్నిటికంటెను ఉత్తమమైన ఆలంబనము. ఇదియే సర్వోన్నతమైన యాలంబనము. దీనిని ఎఱిగినవాడు బ్రహ్మలోకమున ప్రకాశించును. బ్రహ్మలోకవాసులు కూడ అతని మహత్త్వమును కొనియాడుదురు.

కాబట్టి బాలకులు బహ్మచర్యపాలనము విషయమున

విశేషశ్రద్ధ చూపవలెను. ఆజీవనము బ్రహ్మచర్యమును పాటింపలేనివారు 24 ఏండ్లవరకైన పాటింపవలెను. అదియు చేయలేనివారు తక్కువలో తక్కువవివాహమునకు నేటి నిర్ణీతవయఃపరిమితిని అనుసరించి 18 ఏండ్లవరకైన పాటించుట మంచిది. ఈ పరిమితికి తమబ్రహ్మచర్యమును పాడుచేసుకొన్నవారు శాశ్వతముగా పశ్చాత్తాపమును పొందుచు వ్యాధిగ్రస్తులై బాధలు పడి అకాలమరణము పాలు గావలసివచ్చును. మితిమీఱి విషయభోగములననుభవించినవారి బలము, వీర్యము, తేజస్సు, బుద్ధి, జ్ఞానము స్మరణశక్తి నశించును. దుర్గుణములు, దురాచారములును పెచ్చుపెరిగి కడకు దారుణ పతనమును పొందుదురు. కావున గృహస్థులకు కూడ సవినయముగా తెలియ జేయునది యేమన వారు నెలకు ఒక్కమారు ఋతుకాలము నందు మాత్రమే స్త్రీ సహవాసము చేయువలెను. ఏలయనగా అట్లు నియమపూర్వకముగా ఋతుకాలాభిగమనమును మాత్రమే చేయు గృహస్థుడు కూడ బ్రహ్మచారితో, యతీశ్వరునితో సమానుడుగా భావింపబడును.

# విద్య

లోకములో విద్యతో సమానమగు వస్తువు మఱియొకటి లేదు. లోకములోని పదార్థముల తత్త్వములనెఱుగుట కూడ విద్యవలననే సాధ్యమగును. విద్య పంచియిచ్చిన కొలది వృద్ధిపొందు లక్షణము గలది. ఆదరసత్కారములు, పేరుప్రతిష్ఠలు కూడ విద్యవలననే ప్రాప్తించును. విద్యావంతుడు ఎందు పోయినను ప్రజాదరమును, గౌరవమును పొందును. అతడేమి చేయదలచినను చేయగలుగును. విద్యయన్నది గుప్తముగా నుండు ధనము.

కామధేనువు, కల్పవృక్షములవలె విద్య భోగమును ప్రసాదించును. విద్యనెంతని పొగడగలము? అది మోక్షమును ప్రసాదింపగలదు. కారణమేమనిన జ్ఞానమన్నది విద్యకే మఱియొక పేరు. జ్ఞానము లేనినాడు ముక్తిరాదు. ఆ కారణమున అది మోక్షదాయిని కూడ అగుచున్నది.

శ్లో. విద్యానామ నరస్య రూపమధికం ప్రచ్ఛన్నగుప్తం ధనం
విద్యా భోగకరీ యశస్సుఖకరీ విద్యా గురూణాం గురుః
విద్యా బంధుజనో విదేశగమనే విద్యా పరం దైవతం
విద్యా రాజసు పూజ్యతే నహి ధనం విద్యావిహీనః పశుః

(భర్తృహరి నీతిశతకము ---20)

విద్యమానవునకు రూపమునిచ్చును. అది యెవరికిని కానరాకుండ గుప్తముగా దాచబడిన ధనము. అది భోగమును, కీర్తిని, సుఖమును గలుగజేయును. విదేశములకరిగినవేళ అది బంధువులవలె తోడ్పడును. విద్య పరమదైవతము. మహారాజులు విద్యను పూజింతురు. కాని ధనమును పూజింపరు. కావున విద్యలేనివాడు

పశువుతో సమానుడు.

శ్లో. కామధేనుగుణా విద్యా హ్యకాలే ఫలదాయినీ
ప్రవాసే మాతృసదృశీ విద్యా గుప్తం ధనం స్మృతమ్.

(చాణుక్యుడు - 4 / 5)

విద్య కామధేనులక్షణము గలది. అది అకాలములో ఫలము నొసగగలదు. పరదేశమునందది తల్లివలె సహకరించును. విద్య మానవుని గుప్తధన మని యెన్నదగినది.

శ్లో. న చౌరహార్యం న చ రాజహార్యం
న భ్రాతృభాజ్యం న చ భారకారీ
వ్యయే కృతే వర్ధత ఏవ నిత్యం
విద్యాధనం సర్వధనప్రధానమ్

విద్యను చోరులు కాని, రాజులు కాని హరింపజాలరు. దానిని సోదరులు వాటాలు వేసుకొని పంచుకొనజాలరు. ఎంత పెరిగినను అది బరువగునట్టిదికాదు. అది వెచ్చింపబడిన కొలది నిత్యము పెంపొందుచుండును. కావున విద్యాధనమన్నిధనముల కన్న మిన్నయైనది.

ధర్మశాస్త్రముల పరిజ్ఞానము విద్యవలననే ప్రాప్తించును. శాస్త్రాభ్యాసమును భగవానుడు వాగ్రూపమైన తపస్సుగా పేర్కొని యున్నాడు.

శ్లో. అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే.

(గీత 17-15)

ఆరాటమును గలిగింపనిదై, సత్యమై, ప్రియమై హితకరమైనమాటయు, వేదశాస్త్రముల అభ్యాసము, భగవన్నామజపము అనునది వాక్కునకు సంబంధించిన తపస్సని చెప్పబడుచున్నది.

కావున బాలకులు శాస్త్రములనభ్యసించుటకు వీలుగా తప్పక విద్యాభ్యాసము చేయవలెను. తమ బిడ్డలను విద్య నేర్పించు విషయమున తల్లిదండ్రులు పూర్తిగా సహకరించవలెను. తమ బిడ్డలకు విద్యనేర్పించని తల్లిదండ్రులు వారిపాలిట శత్రువులుగా ఎన్నదగిన వారు.

శ్లో. మాతా శత్రుః పితా వైరీ యేన బాలో న పాఠితః
న శోభతే సభామధ్యే హంసమధ్యేబకో యథా.

(చాణక్య 2-11)

తన బిడ్డకు చదువు చెప్పించని తల్లిదండ్రులు వానికి శత్రువుల వంటివారు. ఏలయన చదువు నేర్వనివాడు హంసల నడుమ కొంగ వలె శోభావిహీనుడగును.

బాలురు తాము కూడ స్వయముగా చదువుకొనుటకు విశేషముగా ప్రయత్నము చేయవలసియున్నది. ఈ విషయమున చాణక్యుడిట్లనెను.

శ్లో. రూపయౌవనసంపన్నా విశాలకులసంభవాః
విద్యాహీనా న శోభంతే నిర్గంధా ఇవ కింశుకాః. (3-8)

ఎంత రూపమున్నను, ఎంత యౌవన సంపద యున్నను ఎంత గొప్పకులములో జన్మించినవారైనను చదువులేనివాడు సమాజములో పరిమళములేని పూవులవలె కొఱగానివారగుదురు.

కావున బాలకులారా! విద్యాభ్యాసము కూడ మీకత్యంతము ఆవశ్యకమైనది. ఇప్పటివరకావిర్భవించి గతించిన విద్వాంసులును, ఇప్పుడు సజీవులైయున్న విద్వాంసులును కూడ తాము నేర్చుకొన్న విద్య యొక్క ప్రభావముచేతనే లోకములో ఆదరసత్కారములను పొందియున్నారు. పొందుచున్నారు. జాతి, ఆయువు, పదవి, స్థితి, ధనము, కుటుంబము ఇవి యేవియును విద్యతో సమానముగా అధిక్యమును గౌరవమును గలిగింపజాలవు. మనువు ఇక్కడ ఏమనెనో చూడుడు.

శ్లో. విత్తం బంధు ర్వయః కర్మ విద్యా భవతి పంచమీ
ఏతాని మాన్యస్థానాని గరీయో యద్యదుత్తరమ్
(2-136)

ధనము, కుటుంబము, వయస్సు, కర్మ, విద్య ఈ అయిదును అధిక్యమును, గౌరవమును గలిగించునవి. వీనిలో ధనముకంటె కుటుంబము వలన, కుటుంబముకంటె వయస్సు వలన, వయస్సు కంటె కర్మ వలన, కర్మకంటె విద్యవలన ప్రాప్తించు గౌరవము మిన్నయైనది.

శ్లో. న హాయనైర్న పలితైర్న విత్తేన న బంధుభిః
ఋషయశ్చక్రిరే ధర్మం యోఽనూచానః స నో మహాన్
(2-154)

పెద్ద వయస్సు కలిగి యుండుటవలనగాని, తలపండుట వలనగాని, ధనమధికముగా యుండుటవలనగాని, బంధువులు మున్నగువారి అంగబలము ఎక్కువగా ఉండుట వలనగాని యెవ్వడును గొప్పవాడు గాడు. సాంగముగా వేదాధ్యయనము గావించినవాడు ఎవడో వాడే మనలో గొప్పవాడు అని ఋషులు ధర్మనిర్ధారణము గావించిరి.

శ్లో. నతేన వృద్ధో భవతి యేనాస్య పలితం శిరః
యోవై యువాప్యధీయానస్తం దేవాః స్థవిరం విదుః
(2-156)

తలవెంట్రుకలు పండిన మాత్రమున ఎవ్వడును పెద్దవాడు గాడు. యువకుడైనను విద్యాధ్యయనము చేసినవాడెవడో వానినే దేవతలు పెద్దవానిగా భావింతురు.

విద్యవలన ఏమి కోరిన అది లభించును. కాని తమ పరమకల్యాణమును గోరు మానవులు వేదశాస్త్రములనధ్యయనము

చేయుటకును, పరమాత్మ తత్త్వమును తెలుసుకొనుటకును మాత్రమే విద్యాభ్యాసము చేయవలెను. అందులకై లోకసుఖములను పరిత్యజించుటకైనను, మహాకష్టములను భరించుటకైనను వెనుకంజ వేయరాదు.

కావున బాలకులారా! తిండి చపలత్వము, సరదాలు, భోగములు, విశ్రాంతి, సోమరితనము, ప్రమత్తత మున్నగు లక్షణములను విద్యాభ్యాసమునకవరోధ కరములని యెంచి పరిత్యజించి విద్యాభ్యాసము చేయుటకు పూనుకొనుడు. బొందిలో ప్రాణములు ఉన్నంతవఱకు సాధన చేయుచునే ఉండుడు!

---

# తల్లి తండ్రి గురువు మున్నగు పెద్దల సేవ

బాలకులకు తమ తల్లిదండ్రులను గురువును సేవించుట కంటెను, వారి ఆజ్ఞ పాటించుటకంటెను మించిన పరమధర్మము మఱియొకటి లేదు. ఈముువ్వురను సేవించుటయే పరమధర్మము అనియు, మిగిలినవి అన్నియు ఉపధర్మములు అనియు మనువు కూడ తెలిపియున్నాడు.

శ్లో. త్రిష్వేతేష్వితి కృత్యం హి పురుషస్య సమాప్యతే
ఏష ధర్మఃపర స్సాక్షా దుపధర్మోఽన్య ఉచ్యతే (2-237)

ఈ ముువ్వురను సేవించుటయందే పురుషుడు చేయవలసిన పనులన్నియు సమాప్తములగును అనగా ఇక ఏవియు చేయనక్కఱలేదని

భావము. ఇదియే పరమధర్మము. మిగిలిన వన్నియు ఉపధర్మములు.

కారణమేమన శాస్త్రములలో తల్లి, తండ్రి, గురువు అను ముఱ్ఱురును మూడు లోకములవంటివారని, మూడు వేదముల వంటివారని దేవతలు తెలిపినారు. శ్రుతికూడ - "మాతృదేవో భవ! పితృదేవో భవ! ఆచార్యదేవో భవ" అని చెప్పుచున్నది. అనగా తల్లిని, తండ్రిని, గురువును దైవతముగా భావించువాడవు కావలెను అని భావము.

శ్లో. త ఏవ హి త్రయో లోకాస్త ఏవ త్రయ ఆశ్రమాః
త ఏవ హి త్రయో వేదాస్త ఏవోక్తాస్త్రయోఽగ్నయః(2-230)

తల్లి, తండ్రి, గురువు అనబడు ఆ ముఱ్ఱురే మూడు లోకములు. వారే మూడు ఆశ్రమములు. వారే మూడు వేదములు వారే మూడు అగ్నులు అని చెప్పబడిరి.

భగవానుడు గీతలో తపస్సును గూర్చి వివరించుచు ముందుగా పెద్దలకు సేవచేయుటకు శారీరిక తపస్సుగా వివరించి యున్నాడు.

శ్లో. దేవద్విజగురు ప్రాజ్ఞపూజనం శౌచమార్జవమ్
బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే. (17-14)

దేవతలను, బ్రాహ్మణులను, గురువును, జ్ఞానులను పూజించుటయు, పవిత్రత సరళస్వభావము, బ్రహ్మచర్యము, అహింస యనబడునివి శారీరికతపస్సని చెప్పబడును. కావున బాలకులారా! మీరు సోమరితనమును, నిర్లక్ష్యవైఖరిని వీడి తల్లి, తండ్రి, మున్నగు గురుజనుల (పెద్దల) సేవను పరమధర్మముగా భావించి భక్తితో వారిని సేవింపుడు! పూజింపుడు! వారి యాజ్ఞలను పాలింపుడు!.

# గురు జనుల సేవ

మానవుడు కేవలము ఒక్కగురుసేవవలన కూడ పరబ్రహ్మమును పొందగలుగును. భగవానుడు గీతలో:

శ్లో. అన్యే త్వేవ మజానంతః శ్రుత్వాన్యేభ్య ఉపాసతే
తేఽపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః **(13-25)**

అని చెప్పియున్నాడు. అనగా తదితరులగు మందబుద్ధిగల మానవులు కూడ ఈ విషయములేమియు ఎఱుగనివారైనను ఇతర తత్త్వవేత్తలవలన తాత్త్విక విషయములనాలకించి నన్నుపాసించుచు నుందురు. అట్టి శ్రవణాసక్తులగు పురుషులు కూడ మృత్యు స్వరూపమగు ఈ సంసార సముద్రమును తరించి పోగలరనుటలో సందేహములేదు. అని భావము.

వేదశాస్త్రములందు ఈ విధముగా తరించినవారి ఉదాహరణములు కూడ అనేకములు గలవు.

ఒకానొకప్పుడు ఆయోదధౌమ్యుడు అను మహర్షి యుండెను. ఆయనకు పంజాబునివాసియగు ఆరుణి యను శిష్యుడు ఉండెను. ఒకనాడు గురువు ఆతనితో నాయనా! నీవు పోయి పొలములో నుండి వెలికి పోవుచున్న నీటికి అడ్డుకట్ట వేయుమా! అని ఆజ్ఞాపించెను. అట్లే అని ఆరుణి పొలమునకు పోయి నీటిని నిరోధించుటకు ఎంతయో ప్రయత్నము చేసెను. అయినను నీటిప్రవాహము నిలువలేదు. కడపట అతనికి ఒక యుపాయము తోచెను. దానిని అనుసరించి అతడు స్వయముగా తానే వెలికి పోవుచున్న ప్రవాహమునకడ్డముగా మడియంచున అడ్డుకట్టవలె పండుకొనెను. అంతట ప్రవాహము నిలిచిపోయెను.

పని ముగించుకొని వెంటనే మఱలిరాని కారణమున ఆరుణి యెక్కడున్నాడు? అని ఆశ్రమమందున్న గురువు ఇతర శిష్యులను ప్రశ్నించెను. మీరే కదా! వానిని పొలములో నీటికడ్డుకట్ట వేయుము అని పంపినారు అని వారు బదులు చెప్పిరి. అప్పుడు ఆశిష్యులను వెంట నిడుకొని గురువు పొలమునకు వెడలెను. అక్కడకు చేరి ఆరుణీ! ఆరుణీ! అని బిగ్గఱగా పిలిచెను. ఆ పిలుపు విని ఆరుణి వెంటనే లేచి గురువు దగ్గఱకు వచ్చెను. వచ్చి గురువుగారూ! మీ పొలమునుండి వెడలిపోవుచున్న నీటిని నిలువరించుటకు నేనెంతయో ప్రయత్నము చేసితిని అయినను నీరు నిలువలేదు. అప్పుడు ఇక ఏమి చేయుటకును తోచక నేనే ఆప్రవాహమునకు అడ్డుకట్టగా పండుకొన్నాను. అప్పుడు ప్రవాహము నిలిచినది. మీరు పిలువగా ఇప్పుడు లేచి వచ్చితిని. ఇదిగో! మీకు నమస్కరించుచున్నాను. ఇక ఇప్పుడు నేనేమి చేయవలెనో సెలవీయుడు! అని ఆయనతో సవినయముగా పలికెను. ఆ పలుకులు విని గురువు పరమానంద భరితుడయ్యెను. వత్సా! నీటికి ఉద్దలనము గావించి వచ్చితివి., కావున నీవు ఇటుపై ఉద్దాలకుడు అనుపేర ప్రసిద్ధి గాంచెదవు అని పలుకుచు బిడ్డా! నీవు మనసా, వాచా, కర్మణా, త్రికరణశుద్ధిగా నా ఆజ్ఞను పాలించితివి. కాబట్టి సమస్తవేదములు, ధర్మశాస్త్రములును చదువుకొనకుండగానే నీ హృదయములో ప్రకాశించుగాక! నీకు పరమశుభము ప్రాప్తించుగాక! అని నిన్నాశీర్వదించుచున్నాను. అని పలికి ఆరుణిపై పరమానుగ్రహమును ప్రకటించెను. అనంతరము గురువు కడ సెలవు గొని ఉద్దాలకుడు తన దేశమునకు మఱలిపోయెను.

(ఇది మహాభారతము – ఆదిపర్వము – 3వ అధ్యాయములోని గాథ)

జబాల అను ఒక స్త్రీ యుండెను. ఆమెకు సత్యకాముడను ఒక కుమారుడుండెను. అతడు ఒకప్పుడు హారిద్రుమతగౌతముని

దగ్గఱకు పోయి ఆర్యా! నేను మీ దగ్గఱుండి బ్రహ్మచర్యపాలనము చేయగోరి వచ్చినవాడను అని అతనితో చెప్పెను. అప్పుడు ఆ గౌతముడు (గురువు) నాయనా! నీవు ఏ గోత్రమువాడవు? అని అతనిని ప్రశ్నించెను. మహానుభావా! నా గోత్రము ఏదియో నేను ఎఱుగను అని ఆతడు ప్రత్యుత్తరము ఇచ్చెను. అప్పుడు గౌతముడు వానితో - ఇంత స్పష్టముగా బ్రాహ్మేతరుడు మాటలాడజాలడు. నీవు సత్యమును విడువలేదు. కావున నీవు బ్రాహ్మణుడవు అని పలికెను.

అనంతరము గౌతముడు అతనికి ఉపనయనసంస్కారము గావించెను. తనచెంతనున్న గోవుల మందలోనుండి బక్కచిక్కి దుర్బలముగా ఉన్న నాలుగు వందల గోవులను వేరుచేసి నాయనా! నీవు ఈ గోవులను సేవించుచు వీనివెంట పొమ్ము! అని వానితో చెప్పెను. అప్పుడు సత్యకాముడు గురుదేవా! మీరు చెప్పినట్లు చేసెదను. నాలుగు వందల సంఖ్యలో నున్న యీ గోవులు వేయి సంఖ్యకు చేరునంతవరకు నేను మఱలిరాను అని చెప్పి వాని వెంట ఒకమంచివనములోనికి పోయెను. ఆ వనములో వలయునంత జలసమృద్ధియు, తృణసమృద్ధియు ఉండెను. అతడావనములో గోవులను సేవించుచు చాలాకాలము నిలిచిపోయెను. క్రమముగా గోవులు వేయి సంఖ్యకు చేరెను. అప్పుడు వానిలోని ఒకగిత్త వానితో మహాభాగా! ఇప్పుడు మా సంఖ్య వేయి అయినది. కావున మమ్ము గురుకులమునకు చేర్చివేయుమా! అని సత్యకామునితో చెప్పెను. అప్పుడతడాగోవులను గురుకులమునకు తోలుకొనిపోయెను. యథావిధముగా గుర్వాజ్ఞ పాటించిన కారణముగా ఆ సత్యకామునకు ఆశ్రమమువంక వెడలుచున్న వేళ మార్గమధ్యమందే గిత్త, అగ్ని, హంస, మూలమునను, ముద్గలుని వలనను విజ్ఞానానంద ఘనపరబ్రహ్మ

స్వరూపము సిద్ధించెను. (ఈ గాథ ఛాందోగ్యోపనిషత్తు 4 అధ్యాయములో 4 మొదలు 9వ ఖండము వరకును ఉన్నది.)

ఒకానొకప్పుడు జబాలా తనయుడగు సత్యకామునివలన కమలుని కొడుకగు ఉపకోశలుడు యజ్ఞోపవీతమును గ్రహించి 12 ఏండ్లవరకు అతనికి సేవ చేసెను. అప్పుడు సత్యకాముని భార్య తన భర్తతో స్వామీ! ఈ ఉపకోశలుడు తగిన విధముగా తపస్సు చేసినాడు. మీ ఆజ్ఞానుసారము చక్కగా అన్నివిధులను ఆచరించినవాడు కావున ఇతనికి బ్రహ్మోపదేశము చేయుడు! అని చెప్పెను. ఆమెకు సత్యకాముడు బదులు ఏమియు పలుకక అతనికి ఉపదేశము చేయకయే బయటకు వెడలిపోయెను. అనంతరము ఉపవాసదీక్ష వహించియున్న ఉపకోశలునకు అగ్నులు బ్రహ్మోపదేశము చేసెను. అటుపిమ్మట బయటకు పోయిన సత్యకాముడు తిరిగి వచ్చి ఉపకోశలుని చూచి – సౌమ్యుడా! నీ ముఖము బ్రహ్మవేత్త ముఖమువలె తేజరిల్లుచున్నది. నీకు బ్రహ్మోపదేశము ఎవరు చేసిరి? అని ప్రశ్నించెను. అప్పుడు ఉపకోశలుడు సైగలతో అగ్నులు అని తెలియజేసెను. ఏమి ఉపదేశము చేసినవి? అని గురువు మఱల ప్రశ్నించెను. శిష్యుడు జరిగిన విషయములన్నియు యథాతథముగా వివరించెను. అప్పుడు సత్యకాముడు వానితో నాయనా! ఇప్పుడు నేను నీకు ఆ బ్రహ్మోపదేశము గావించెదను. దీనిని శ్రవణము చేసి తెలిసికొన్న మీదట నీటిని అంటని తామరాకువలె పాపములంటని వాడవయ్యెదవని చెప్పెను. ఉపకోశలుడందులకు సంసిద్ధుడయ్యెను. ఆచార్యుడు (సత్యకాముడు) వానికి బ్రహ్మోపదేశము చేసెను. అంతట వానికి బ్రహ్మప్రాప్తి కలిగెను. (ఈ గాథ ఛాందోగ్యోపనిషత్తు 4 అధ్యాయములో 10 మొదలు 15వ ఖండము వఱకును ఉన్నది)

ఈనాటి విద్యార్థులు (బాలకులు) 'ఎవరితోడ ఎట్లు మాట

లాడవలెను' అన్న విషయమును ఇంచుమించుగా మఱచిపోయినారు. ఉపాధ్యాయుడు, గురువు, ఆచార్యుడు మొదలగు గురుజనులతోడ మంచిగా వ్యవహరించుట మానివేయుటయే కాదు. వారిని తుచ్ఛదృష్టితోడను చూడ మొదలుపెట్టినారు. వారిని పరిహసింపసాగినారు. ఇదియంతయు వారికి తగిన విధముగా శాస్త్రముల శిక్షణ ప్రాప్తించియుండని కారణమున వచ్చిన పరిణామము. గురువుల చెంతకు పోయి వారినెట్లు సేవింపవలెను? వారినెట్లు పూజింపవలెను? ఎట్లు సత్కరింపవలెను? వారితోడ ఎట్లు వ్యవహరింపవలెను? అను నిట్టి విషయములు మనువు మున్నగు మహర్షులు చెప్పిన మాటలను పరిశీలించిన మనకు బాగుగా తెలియగలవు. మనదేశము యొక్క ఆదర్శము మహోన్నతమైనది. మనవారు గురువులతో వ్యవహరించిన తీరును, వారి సభ్యతను స్మరించి ఏ మానవుడైనను ముగ్ధుడైపోవును. ఇదిగో! మనువుచెప్పిన మాటను చూడుడు.

శ్లో. శరీరం చైవ వాచం చ బుద్ధీంద్రియమనాంసి చ
నియమ్య ప్రాంజలిస్తిష్ఠేద్వీక్షమాణో గురోర్ముఖమ్.
(2-192)

(శిష్యుడు) శరీరము, వాక్కు, బుద్ధి, ఇంద్రియములు, మనస్సు - అను వీనినన్నిటిని అదుపులో నుంచుకొని చేతులు జోడించుకొని సవినయముగా గురువు ముఖమువంకకు చూచుచు ఆయన యెదుట నిలువబడవలెను.

శ్లో. హీనాన్నవస్త్రవేషః స్యాత్ సర్వదా గురుసన్నిధౌ
ఉత్తిష్ఠేత్ప్రథమం చాస్య పరమం చైవ సంవిశేత్ (మను:2-194)

గురువు సమక్షమున శిష్యుడు ఎల్లప్పుడును సాధారణమైన అన్నమును తినువాడై, సాధారణ వస్త్రమును దాల్చువాడై, సాధారణవేషము వేయువాడై మెలగవలెను. గురువులేచుటకు ముందుగా

లేవవలెను. కూర్చున్న తరువాత కూర్చుండవలెను. (పరున్నతరువాత పరుండవలెను)

శ్లో. ఆసీనస్య స్థితః కుర్యాదభిగచ్ఛంస్తు తిష్ఠతః
ప్రత్యుద్గమ్య త్వావ్రజతః పశ్చాద్ధావంస్తు ధావతః (2-196)

శిష్యుడు ఎల్లప్పుడును తన గురువు కూర్చుండి యున్నచో తాను నిలువబడియు, నిలువబడియున్నచో ఎదుటకు పోయి నిలిచియు, తన వంకకే వచ్చుచున్న వేళ తాను కొన్ని యడుగులు ఎదురుగా వెడలియు, పరుగిడుచున్నవేళ వెనువంక పరుగిడుచును ఆయనతో మాటలాడవలెను.

శ్లో. నీచం శయ్యాసనం చాస్య సర్వదా గురుసన్నిధౌ
గురోస్తు చక్షుర్విషయే న యథేష్టాసనో భవేత్ (మను:2-198)

గురువు సమీపమందున్నవేళ శిష్యుడెల్లప్పుడు తన శయ్యను, ఆసనమును ఆయనశయ్యకంటె ఆసనముకంటె దిగువగా నుండునట్లు ప్రవర్తించుచుండవలెను. ఆయన దృష్టికి ఎదురుగా ఎన్నడును అవినయయముగా తన యిష్టానుసారముగా ఏదియో ఒక భంగిమలో కూర్చుండరాదు. గురువుతోడ అసత్యాచరణము చేయు శిష్యుడు దుర్గతి పాలగును. ఇక్కడ మనువు ఏమనెనో చూడుడు.

శ్లో. పరీవాదాత్ఖరో భవతి శ్వా వై భవతి నిందకః
పరిభోక్తా కృమిర్భవతి కీటో భవతి మత్సరీ. (2-201)

గురువుపైన యసత్యదోషారోపణము గావించినవాడు గాడిద యగును. ఆయనను నిందించినవాడు కుక్క యగును. అనుచితరీతిని ఆయన ధనమును అనుభవించువాడు క్రిమి అగును. ఆయన్పై ఈర్ష్యాద్వేషములను పెంచుకొన్నవాడు కీటకము అగును.

కావున గురువుతోడ ఎన్నడును అనుచితముగా వ్యవహరింప రాదు. బాలకులారా! మీరు గురుజనుల చెంతకు విద్యాభ్యాసము

చేయుటకై వెడలినప్పుడు సర్వదా మీ మనస్సును, వాక్కును ఇంద్రియములను అదుపులోనుంచుకొనుడు! సాధారణవేషమును దాల్చుడు. శ్రద్ధాభక్తులతో ప్రవర్తిల్లుడు; గురువు కూర్చున్న స్థానమునకు దిగువగా కూర్చుండుడు! వినయముతో సరళస్వభావముతో వారికి నమస్కారము చేయుడు! ఈ నియమములను పాటించుచు విద్యాభ్యాసమునకు, ప్రశ్నోత్తరకార్యక్రమమునకు పూనుకొనుడు!

మీరట్లు మెలగుచున్నచో గురువులు ప్రేమతోడను, ప్రసన్నతతోడను మీకుపదేశము చేయుదురు. చక్కని శిక్షణనిత్తురు. విద్యాది విషయములను బాగుగా నేర్పగలుగుదురు. సేవాభావముతో ప్రవర్తిల్లు శిష్యుడు వారివలన సులభముగా విద్యాగ్రహణము చేయగలుగునని భగవానుడు గీతలో కూడ చెప్పియున్నాడు –

శ్లో. తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః **(4-34)**

'గురువులచెంతకు బోయి వారికి సాష్టాంగనమస్కారములు గావింపుము. శుశ్రూష చేయుము. నీ సందేహములు తీరునట్లు సర్వవిధముల వారిని ప్రశ్నింపుము! అప్పుడు తత్త్వవేత్తలు జ్ఞానులును అయిన ఆ గురువులు నీకు జ్ఞానముపదేశింతురు అని పైశ్లోకమునకు భావము.'

ఇప్పుడు గురుజనులకెట్లు ప్రణమిల్లవలెనో మనువు వివరించి యున్నాడు చూడుడు –

శ్లో. వ్యత్యస్తపాణినా కార్య ముపసంగ్రహణం గురోః
సవ్యేన సవ్యః స్ప్రష్టవ్యో దక్షిణేన చ దక్షిణః **(2-72)**

గురువునకు నమస్కరించు వేళ ఈ చేయి ఆ వంకకు, ఆ చేయి యీ వంకకు ఉండునట్లు వ్యత్యస్తము చేయవలెను. కుడి చేతితో ఎడమ పాదమును, ఎడమ చేతితో కుడిపాదమును తాకి నమస్కారము

చేయవలెను.

తల్లి, తండ్రి మొదలైన పూజనీయులగు ఇతర గురుజనులకు నమస్కరించినప్పుడు కూడ ఈ విధమునే పాటింపవలెను. ఏల యనగా పెద్ద సోదరి, అన్న భార్య, పినతల్లి, మేనమామ భార్య, మేనత్త, అత్త(భార్యయొక్క తల్లి) మీరు అందరును గురుపత్నితోడను తల్లితోడను సమానులు. వీరి భర్తలు గురువుతోడను, తండ్రితోడను సమానులు. కావున వీరికి ఎల్లరకును సేవాసత్కారములు చేయుటయు, నమస్కారము లాచరించుటయు మానవుని కర్తవ్యము.

తనకంటె ఎవరు ఏ విధముగా పెద్దవారయినను వారికి అందరకును సేవ చేయవలెను. నమస్కారములాచరింపవలెను. వారియందును కూడ ఎవ్వరైన వేదశాస్త్రములు చదువుకొన్న పండితులు, బ్రాహ్మణులైనవారున్నచో వారు మఱింతగా సాష్టాంగప్రణామ - ఆదరసత్కారాదులకు పాత్రులని యెఱుగవలెను.

---

# మాతాపితరుల సేవ

తల్లిదండ్రులను సేవించుట యన్న వారందఱికంటె అధికముగా పూజించి సత్కరింపదగినవారు. ఆవిషయమున మనువు ఇట్లనుచున్నాడు -

శ్లో. ఉపాధ్యాయాన్ దశాచార్య ఆచార్యాణాం శతం పితా
సహస్రం తు పితౄన్ మాతా గౌరవేణాతిరిచ్యతే (2-145)

పదుగురు ఉపాధ్యాయులకంటె ఒక ఆచార్యుడు, నూరుగురు ఆచార్యుల కంటె ఒక తండ్రియు, వేయిమంది తండ్రులకంటె ఒక తల్లియు గౌరవముచేత గొప్ప యగును.

కావున శ్రేయస్సును కోరుకొను మనుజుడు శ్రద్ధాభక్తుల తోడను, తత్పరతతోడను తల్లిదండ్రుల సేవ చేయవలెను. మహారాజగు ధర్మరాజు చరిత్రమును చూడుడు. అతడు సదాచారపరాయణుడు. సద్గుణశాలి, భగవద్భక్తుడు, అజాతశత్రువు, (శత్రువులు లేనివాడు) పరమ ధర్మాత్ముడు. అతని సుగుణములను, సదాచరణములను ఎవ్వరును ఇట్టివి అట్టివి అని వర్ణింపజాలరు. అంతటి మహానుభావు డగుటతో బాటు అతడు తన మాతాపితరులందు అసాధారణమైన భక్తి గలిగియుండువాడు. అంతియే కాదు. అతడు తన పెదతండ్రియగు ధృతరాష్ట్రునియందు, అతని భార్యయగు గాంధారియందును కూడ విశేష భక్తిశ్రద్ధలు కలిగి మెలగుచుండువాడు. వారు తనకేదైన అనుచితమైన యాజ్ఞ విధించినను శంకింపక దానిని కూడ పాటించుట తన పరమధర్మముగా భావించువాడు.

ఒక సమయమున ధృతరాష్ట్రుడు పాండవులను భస్మము చేయు సంకల్పముతో వారణావతమున లక్కయింటిని నిర్మింపజేసి దుర్వృత్తిని

మనస్సులో నుంచికొని వారిని పిలిపించి నాయనలారా! మీరు మీ అమ్మతోడ పోయి ఆ లక్కయింటిలో నివసింపుడని వారిని ఆజ్ఞాపించెను. ధృతరాష్ట్రుని కుట్రనెఱిగి యుండియు అతని కపటభరితమైన ఆ యాజ్ఞను కూడ శిరసావహించి ధర్మరాజు వారణావతమునకు బోయి సోదరులతోడను, తల్లితోడను, గూడి ఆ లక్కయింటిలో నివాసము చేసెను. అయినను వారికెట్టి యపాయమును గలుగలేదు. ధర్మము యొక్క అండదండలను వీడనివారగుటచేత వారిని ఆధర్మమే రక్షించెను. సాక్షాత్తు మూర్తీభవించిన ధర్మదేవత యనదగు విదురుడు లక్కయింటినుండి సొరంగమార్గమును తవ్వించి పాండవులను వారి తల్లితోడ వెలికి రప్పించి రక్షించెను. ఈ విధముగా ఎవడు ధర్మము పాటించునో వానిని ఆ ధర్మమే బాధ్యత వహించి రక్షించుచుండును. 'ధర్మము ఎవ్వరిని విడువదు. ధర్మమునే అందఱు విడచిపెట్టుచుందురు' అని శాస్త్రము చెప్పుచున్నది. కాబట్టి మానవుడు తనపై ఎంత భయంకరమైన విపత్తు వచ్చిపడినను చలింపరాదు. కామ – క్రోధ – లోభ – మోహ భయాదులకు లోబడి యెన్నడును ధర్మమును విడువరాదు.

ధర్మరాజుపై వరుసగా ఎన్నియో విపత్తులు వచ్చిపడినవి. అయినను అతడు ధర్మమును విడువలేదు. ఆ కారణమున ప్రతి పర్యాయము అతనిని ధర్మమే కాపాడుచు వచ్చెను.

జూద మాడుట మహాపాతక హేతువు, సర్వానర్థములకును మూలము అని యెఱిగి యుండియు ధృతరాష్ట్రుని యాజ్ఞ యగుట చేత ధర్మరాజు జూదమాడెను. దాని ఫలితముగా ద్రౌపది భయంకరమైన అవమానమును భరింపవలసి వచ్చెను. వనవాసక్లేశములను సహింపవలసి వచ్చెను. అయినను పెద్దల యాజ్ఞను పాటించుటయను ధర్మమును విడువకున్న కారణముగా భగవానుని యనుగ్రహమున కడకు వారికే

విజయము లభించెను.

అనంతరము ధర్మరాజు అచంచలమైన రాజ్యలక్ష్మిని పొందియున్న కాలమందు కూడ తనకు తీరని యన్యాయములు గావించిన వారైనను ఆ గాంధారీధృతరాష్ట్రుల చెంతకు పోయి నిత్యము ప్రణామపూర్వకముగా వారిని సేవించుచుండువాడు. కడపట ధృతరాష్ట్రుడు వనవాసమునకు బయలుదేరు వేళ ముందుగా యుద్ధములో మరణించిన తన బంధువులను, పుత్రులనుద్దేశించి విరివిగా అపరిమితమైన ధనమును బ్రాహ్మణులకు దానము చేయ కుతూహల మగుచున్నదని ధర్మరాజున కెఱిగింపజేసెను. అప్పుడు ధర్మరాజు - తండ్రీ! ఇందు నాది యనదగునదేది యున్న అది యెల్లమీదే. కడకు ఈ నా శరీరము కూడ మీయధీనమయినదే. కావున యథేచ్ఛగా మీరు ఏది చేయదలచుకొన్న అది చేయుడు. అని విదురుని చేత ఎఱిగింపజేసెను. ( ఈ గాథ మహాభారతము - ఆశ్రమ వాసిక పర్వము 12వ అధ్యాయములోనిది).

కావున బాలకులారా! మీరే యోచింపుడు. తనతోడ ద్వేషము పెంచుకొని అనుక్షణము తన ప్రాణములను హరించుటకు ప్రయత్నించిన వారితోడ గూడ ఇంత ధర్మయుక్తముగాను, ఉదారబుద్ధితోడను వ్యవహరింపగలుగుట సాధారణవిషయమగునా? ఎన్నటికిని గాదు. ఆ కారణమున ధర్మరాజు పేరు నేటికిని లోకములో కీర్తింపబడుచున్నది. ధర్మపాలనము యొక్క ప్రభావము కారణముగానే అతడు బొందితో స్వర్గమునకరగుటయు, అనంతరము అచంచలమైన పరమపదమును పొందుటయు సంభవమైనది. కాబట్టి మనము కూడ మనతో అనుచితముగా వ్యవహరించిన వారైనను మన తల్లి, తండ్రి మున్నగు గురుజనములకు మిక్కిలి శ్రద్ధాభక్తులతోడను, సరళ స్వభావము తోడను సేవలు చేయవలెను.

ఇక జన్మ నిచ్చిన తల్లిదండ్రులయినచో వారి విషయము వేఱుగా చెప్పనక్కరలేదు. వారిని అందఱికంటె అధికముగా సత్కరింపవలెను. కారణమేమన మనలను పెంచి పెద్దచేసిన సందర్భములో వారు పడిన కష్టములను తలచుకొన్నచో మనకే శరీరమునందు గగుర్పాటు జనించును. ఈ విషయమున మనువు ఏమనెనో చూచితిరా?

శ్లో. యం మాతాపితరౌ క్లేశం సహేతే సంభవే నృణామ్

న తస్య నిష్కృతిః శక్యా కర్తుం వర్షశతైరపి. (2-227)

మానవుడు జన్మించువేళ తల్లిదండ్రులే క్లేశమును భరింతురో దానికి బదులు నూరు జన్మలెత్తి వారికి సేవజేసినను వారి ఋణము నుండి మనము విముక్తులము కాజాలము.

కాబట్టి ఋణము తీర్చుకొనవలెనన్న ఉద్దేశ్యమును మాని వారిని సేవించుట, పూజించుట, వారి యాజ్ఞను పాలించుట అనువానిని మన పరమ కర్తవ్యముగా భావించుకొని ఆచరించుచుండవలెను. అదియే మనకు పరమ ధర్మము. అది యొక మహాతపస్సు. అనగా తల్లిదండ్రులను సేవించుట కన్న మిన్నయగు ధర్మము కాని, తపస్సు కాని మఱియొకటి లేదు. ధర్మవ్యాధుని చరిత్రను చూడుడు. అతడు వ్యాధుడు (బోయవాడు) అయి ఉండియు తన తల్లిదండ్రులను సేవించుట వలన త్రికాలవేత్త అయ్యెను.

అతడు తన తల్లిదండ్రులను సర్వోత్తమమైన దేవతామందిరము వంటి సుందరమైన భవనములో వసింపజేయువాడు. వారి సుఖమును గోరి అతడాభవనములో ఎన్నియో మంచములను, ఆసనముల నేర్పరచెను. మానవులు దేవుని పూజించు విధముగా అతడు తనకు యజ్ఞములైన, అగ్నులైన, హోమవిధులైన, వేదములైన, పరదైవతములైన తల్లిదండ్రులే యని భావించుకొని పూలతో, పండ్లతో, ధనముతో నిత్యము వారిని సంతోషపెట్టుచుండువాడు. అతడు స్వయముగా వారికి

పాదప్రక్షాళనము చేయువాడు. స్నానము చేయించువాడు. భోజనము చేయించువాడు. వారితో మధురముగా ప్రియవచనములాడువాడు. వారికనుకూలమగు పద్ధతిలో నడుచుకొనుచుండువాడు. ఈ విధముగా అతడలసత్వము (సోమరితనము) మాని శమదమాది నియమములను పాటించుచు, మనసా వాచా కర్మణా త్రికరణశుద్ధముగా తన భార్యా పుత్రులతో గూడి ఎంతయో ఆసక్తితో వారికి సేవ చేయుచుండెను. ఆ విధమైన తపస్సుచేసి అతడు క్రమముగా లోకములో అచంచలమైన కీర్తిని, దివ్యదృష్టిని పొంది కడకు ఉత్తమగతిని అందుకొనెను. (మహాభారతము - వ.ప. అధ్యాయము 214 -215)

కౌశిక ముని మొదట తల్లిదండ్రుల యనుమతి బడయకయే తపస్సు చేయుటకు వెడలెను. అతని వలన మాతాపితరుల సేవ తపస్సుకన్న మిన్నయని తెలుసుకొనెను. వెనుకకు మఱలి చిరకాలము తల్లిదండ్రులను సేవించి అంతమందు ఉత్తమగతిని పొందెను.

మాతాపితరులను సేవింపక, వారి యాజ్ఞను పాటించక వారితోడ విపరీతముగా ప్రవర్తిల్లువానికి ఇహమునందు నిందయు, దుర్గతియు ప్రాప్తించును.

మహారాజగు కంసుడు తన తండ్రి దగ్గఱ నుండి రాజ్యమును బలవంతముగా హరించి అతనిని కారాగారములో పడవైచెను. ఆ కారణముగా వానికి ప్రాప్తించిన అపకీర్తి, కళంకము ఇప్పటికిని సమసిపోక లోకములో నిలిచియే యున్నది. అది యెట్లనగా ఈనాడు లోకములో ఎవడైన తన తల్లిదండ్రుల , యెడల దుర్మార్గముగ వ్యవహరించినచో వానిని వాని తల్లిదండ్రులు, ఇతర జనులును కూడ కంసుడురా! కంసుడు! చెడబుట్టినవాడు అని నిందించుచుందురు. కాని ఏ పిల్లవాడు తన తల్లిదండ్రులకు నమస్కరించి, సేవచేసి, వారి యాజ్ఞలను పాటించుచు వారికి అనుకూలముగా సంచరించునో, వానిని వాని

తల్లిదండ్రులు, ఇతర జనులు కూడ ముగ్ధులై గద్గదకంఠములతో తపశ్శాలియగు శ్రవణకుమారునితో పోల్చి కొని యాడుచు ఎంతయో యభినందింతురు. కావున బాలకులారా! మీరు ఎన్నడును కంసావతారులను అప్రతిష్ఠను పొందకుడు. శ్రవణకుమారుని ప్రతిరూపముల ప్రశస్తిని సంపాదించుకొనుడు.

శ్రవణకుమారుని చరిత్రమును మీరు వినియే యుందురు. అతడు తపస్సు చేసుకొనునట్టి వైశ్యవంశీయుడగు ఒక ఋషియొక్క కుమారుడు. ఈతని గాథ వాల్మీకిరామాయణములో అయోధ్యా కాండమునందలి (63-64) సర్గములందు విస్తారముగా వర్ణింపబడి యున్నది.

మర్యాదాపురుషోత్తముడగు శ్రీరామచంద్రుడు తండ్రి యాదేశమును శిరసావహించి సానందముగా వనమునకు వెడలిపోయెను. అప్పుడు దశరథుడు ఆజ్ఞాకారి యగు తనయుని విరహము కారణముగా వ్యాకులత చెందుచు కౌసల్యామందిరములోనికి పోయి అతని శీలమును, ఆచరణములను తలపోసి రోదింప మొదలుపెట్టెను. శ్రీరామచంద్రుడు వెడలిపోయిన నాటికది ఆరవ దివసము. ఆనాటి యర్ధరాత్రి సమయమందు పుత్రవిరహము కారణముగా మిక్కిలి కలత చెంది దశరథుడు కౌసల్యతో ఇట్లుచెప్పెను.

దేవీ! నీకు ఒక పూర్వసంఘటనమునెఱిగించుచున్నాను. వినుము! అప్పటికింకను మనకు వివాహము గాలేదు. నేను యువరాజపదమును పొంది యున్నాను. ఆ కాలమునందు ఒకనాడు నేను దురభ్యాసము కారణముగా ధనుర్బాణములను ధరించి, రథమునధిరోహించి వేటాడుటకై సరయూతీరమునకరిగితిని. అక్కడకు దున్నలు, ఏనుగులు, మున్నగు వన్యజంతువులు నదిలో నీరములు గ్రోలుటకు వచ్చుచుండెను. ఆ సమయమున వాన కురియుచుండెను.

నాలుగు దెసల చిమ్మచీకటులలుముకొనియుండెను. అట్టి తరుణము నందు యెవడో నీటిలో కడవను ముంచెను. దాని నుండి బుడ బుడ మను శబ్దము వెలువడెను. దానిని దూరమునుండి విని నేను ఏనుగు ఏదియో నీరు త్రాగుచున్నదని భ్రమించితిని. వెంటనే ఆ శబ్దము వచ్చు దిక్కునకు శబ్దభేది బాణమును ప్రయోగించితిని. అప్పుడు నాకు ఒక వనవాసియొక్క ఆర్తనాదము, విలాపమును ఇట్లు వినవచ్చినవి.

అయ్యో! అయ్యో! ఈ బాణమును ఎవరు ప్రయోగించినారు! నేను తపస్సు చేసుకొనువాడను. ఈ యర్ధరాత్రి సమయమున నీరము కొఱకు ఈ తీరమునకు వచ్చితిని. కందమూలాదులను తిని తపస్సు చేసికొనుచు వనవాసము గావించు జటావల్కలధారిని నేను. ఇట్టి నాపై బాణప్రయోగము చేసి నాకు మృత్యుదశను కల్పించిన వారు ఎవరు? నన్ను చంపుటవలన ఎవరికైనను ఏమి లాభము గలుగును? నేను ఎవరికిని ఎట్టి హానిని తలపెట్టలేదే! మఱి నాపై ఈ విధముగా అస్త్రమునెవరు ప్రయోగించిరి? నాకు నా ప్రాణములు పోవుచున్నవన్న చింతలేదు. వృద్ధులైన నా తల్లిదండ్రులను గూర్చి నాకు చింత గలుగుచున్నది. ఇప్పటివఱకు నేనే సర్వవిధముల 'సంరక్షించు కొనుచు వచ్చితిని. ఇప్పుడు నేను మరణించినచో ఆ వృద్ధమాతాపితరుల గతి యేమి కావలెను? హా! ఈవిధముగా మాముగ్గురకును గూడ మరణము సిద్ధమైనది కదా!

కౌసల్యా! కరుణా జనకములైన యా మాటలను విని నేనెంతయో దుఃఖమును పొందితిని. నా చేతినుండి ధనుర్బాణములు జారిపోయినవి. నేను కర్తవ్యవిమూఢుడనైతిని. జ్ఞానము అంతరించి శోకాకుల చిత్తుడనై ఆయార్తనాదము వినవచ్చిన దిక్కునకు పరుగిడిపోయి చూచితిని. అక్కడ సరయూతీరమునందు నీటి కడవను చేతబట్టుకొని రక్తలిప్తమైన శరీరముతో, అందు నాటు కొన్న బాణముతో

ఒక ముని బాలకుడు నేలమీదపడి విలవిల లాడుచుండెను. ఆ పిల్లవాడు నన్ను చూచి ఇట్లు పలికెను.

మహారాజా! నేను మీ యెడల ఏమి యపరాధము చేసితిని? నేనొక వనవాసిని నా తల్లిదండ్రులకు త్రాగుటకై మంచినీరు కొనిపోవుటకు వచ్చితిని. వారిరువురును బలహీనులు. గ్రుడ్డివారు. దప్పికతో బాధపడుచున్నారు. వారు నారాకకై యెదురు చూచుచు చింతాక్రాంతులై యుందురు. నా యీ దురవస్థను కూడ వారు ఎఱుగరు. కావున మహారాజా! నాతండ్రి మిమ్ము కూడ శపించి భస్మము చేయక ముందుగనే మీరు వడిగా పోయి యీ యుదంతమును నా తండ్రికెఱిగింపుడు. ఇదిగో! ఈ కాలిబాటననుసరించి పోయిన మీరు నా తండ్రి యాశ్రమమునకు చేరగలరు. మీరు వడిగా పోయి నా తండ్రికి ప్రసన్నత కలుగు విధముగా ఊరట గలిగించుటకు ప్రయత్నము చేయుడు. అట్లు కాకున్న ఆయన మిమ్ము శపించవచ్చును. నా శరీరములో నాటిని యీ వాడి బాణమును వెలికి తీసి నన్ను దుఃఖరహితుని గావింపుడు!

ఇట్లు పలికి ఆ ఋషిబాలకుడు ఆసన్నమరణావస్థలో నున్నను ధైర్యము వహించి నేను చింతించుచున్న పరిస్థితిని బట్టి నామనోభావమునెఱిగినవాడై మహారాజా మీరు బ్రహ్మహత్యకై వెఱచి నా శరీరములో నాటిన బాణమును వెలికి తీయుటకు శంకించు చున్నారు. నేను బ్రాహ్మణ బాలకుడను గాను. వైశ్య కుమారుడను. కావున శంకింపక బాణమును తీసివేయుడు. అని కూడ చెప్పినాకు కొంత ఊరట గలిగించెను. అప్పుడు నేనతని యెదనుండి బాణమును లాగివైచితిని. అప్పుడతడెంతయో వేదననుభవించి అసువులను బాసెను. అతడా విధముగా మరణించినందులకు నేనెంతయో విచారించితిని. ఇప్పుడు శుభమును పొందుటకు నాకు మార్గమేది?

అని కూడ కొంత తడవు ఆలోచించితిని. అటుపిమ్మట ఆ కడవను నీటితో నింపి చేత బట్టుకొని ఆ ఋషిబాలకుడు చూపిన మార్గమనుసరించి అతని తండ్రి యాశ్రమమునకు వెడలితిని.

దేవీ! కౌసల్యా! అక్కడ ఆ వృద్ధదంపతుల అవస్థను చూచి నాకు దుఃఖమతిశయించినది. వారు మిక్కిలి దుర్బలులై యుండిరి. వారి దశ బహు శోచనీయముగా నుండెను. నా పాదముల అలికిడి విని వారు తమ కొడుకే వచ్చెనని తలచి నాయనా! ఇంత యాలస్య మయినదేమి? సరియే! ఏది? మాకు కొంచెము మంచినీరు ఇమ్ము! మేము కన్నులు లేనివారము. ఆ కారణమున మాకు దిక్కైన, కన్నైన, ప్రాణమైన నీవే! అదేమి? బదులు పలుకవేమి? అని పలకరించిరి. అప్పుడు నేనెంతయో భయపడుచు మిక్కిలి జాగరూకత వహించి ముందుగా నన్ను వారికెఱిగించుకొని పిమ్మట క్రమముగా శ్రవణుడు మరణించిన విషయమును జరిగినది జరిగినట్లు వారికి వినిపించితిని.

అప్పుడు వారికి ఒక్క మాఱుగా కన్నుల నీరు గ్రమ్మెను. పుత్రశోకము చేత మిక్కిలి వ్యాకులచిత్తుడై నిలువబడి యా వృద్ధముని నాకు నమస్కరించి ఇట్లు పలికెను. – మహారాజా! నీవు దారుణమైన దుష్కర్మము చేసితివి. ఈ విషయమును నీవు స్వయముగా నీ నోటితో చెప్పియుండకపోయినచో ఇప్పుడే నీతల వేయివ్రక్కలై నీ రఘువంశ మంతయు నాశనమంది యుండెడిది. సరియే! జరగనై యున్నది జరిగినది. మమ్ములను ఇప్పుడు మా బిడ్డ దగ్గఱకు గొనిపొమ్ము! మేము ఒక్కమాఱు వాని స్పృశించి చూచుకొనగోరుచున్నాము. ఇటుపై ఇక వానిని ఈజన్మలో చూడలేము గదా!

అనంతరము పుత్రశోకముతో విలపించుచున్న యా వృద్ధ దంపతులను ఇరువురను వారి బిడ్డయున్న దిక్కునకు కొనిపోయితిని. వారు తమ బిడ్డను చేతితో తాకి నేలపై వాలిపోయి ఎంతయో

కరుణాజనకముగా ఇట్లు విలపింపమొదలు పెట్టిరి. - హా పుత్రా! హా శుభ చరిత్రా! హా ప్రశంసాపాత్రా! ప్రతిదినము అర్ధరాత్ర సమయము మీఱిన వేళ మేల్కొని ధర్మశాస్త్రాదులను పఠించువాడవే! వానిని ఆలకించి మేమెంతయో యానందించువారమే! ఇటుపై మేమెవరినోట శాస్త్ర ప్రసంగములు విని యానందించువారము? హా వత్సా! ఇక ప్రాతఃకాలమున లేచి స్నాన మాచరించి సంధ్యావందనము, హోమ విధులను నిర్వర్తించుచు ఎవరు మాకు ముదమును గావింపగలరు? హా ప్రియతమతనయా! గ్రుడ్డివారమయిన కారణమున మేము ఎక్కడకును బోయి కందమూల ఫలాదులను సేకరించుకొనజాలని వారము. నీవు మాకు స్నానధ్యానములకు, అన్నపానాదులకును తగిన ఏర్పాట్లు చేయువాడవు గదా! నీవు ఇప్పుడు మమ్ము వీడి వెడలిపోయితివా? అయ్యో! ఇటుపై మాకు వనము నుండి కందమూల ఫలాదులను సేకరించి తెచ్చి ప్రియమైన అతిథికి వలె ఆరగింపజేయువారు ఎవరు? ఇక నిన్ను వీడి అసహాయులమై, అనాథులమై అనుక్షణము పెల్లుబుకుచున్న దుఃఖభారమును భరించుచు ఈ వనములో నిలువజాలము. శీఘ్రముగా దేహత్యాగము చేసి యమలోకములకు పోయెదము. నాయనా! నిజముగా నీవు పాపరహితుడవే. అయినను పూర్వజన్మలో ఏదియో పాపము చేసియుందువు. ఆ కాగణముననే నీకు ఇట్టి మరణము ప్రాప్తించినది. శస్త్రముచే చంపబడిన వీరులకు ఏ లోకములు ప్రాప్తించునో అవి మా సత్యముచే నీకు ప్రాప్తించునుగాక! సగరుడు, దిలీపుడు, హరిశ్చంద్రుడు, మున్నగు రాజర్షులకు ప్రాప్తించిన ఉత్తమగతి నీకు ప్రాప్తించుగాక! పరలోకమునుద్దేశించి సత్కర్మాచరణము చేసి దేహత్యాగము చేసినవారు ఏ యుత్తమగతిని పొందుదురో అది నీకు సిద్ధించుగాక ఈ విధముగా ఆ ఋషి సకరుణముగా రోదించుచు

భార్యాసమేతుడై పుత్రునకు జలాంజలిని అర్పించెను. అనంతరము ధర్మవేత్తయగు ఆ ఋషికుమారుడు తానప్పటి వఱకు చేసిన కర్మల బలముచే దివ్యరూపమును ధరించి విమానమధిరోహించి దివ్యలోకమునకు వెడలిపోవుచు క్షణకాలము నిలిచి తన తండ్రికి ఊరట గొలుపుచు ఇట్లు పలికెను - తండ్రీ! నేనిప్పటివఱకు మీకు చేసిన సేవవలన ప్రాప్తించిన పుణ్యము యొక్క బలముచే సర్వోన్నతమైన స్థానమును పొందితిని. ఇప్పుడు నేను వెడలుచున్నాను. మీరు కూడ శీఘ్రముగా నా దగ్గఱకు రాగలరు. అనంతరము ఆ ఋషికుమారుడు సానందముగా తనకిష్టమగు దివ్యలోకమునకు వెడలిపోయెను.

దేవీ! అటుపిమ్మట ఆ అంధముని చేతులు జోడించుకొని ఎదుట నిలిచియున్న నావంకకు తిరగి నిలువబడి రాజేంద్రా! నీవు క్షత్రియుడవు. తెలియని దశలోనే నీవు నా బిడ్డను చంపితివి. ఈ కారణముగా నీకు బ్రహ్మహత్యాదోషమంటదు. కాని ముందుముందు మావలెనే నీకు కూడ భయంకరమైన దురవస్థ ప్రాప్తించును. అనగా పుత్రవియోగమువలన కలిగిన వేదనతోనే అసువులను బాసెదవు. అని పలికి నన్నుశపించెను. తరువాత కరుణాజనకముగ విలపించుచు చితిని పేర్చి తమపుత్రుని శవముతోడ తాము ఇరువురును కూడా భస్మమై యా వృద్ధదంపతులు స్వర్గమునకు వెడలిపోయిరి.

వింటివి కదా! కౌసల్యా! నాడు నేను శబ్దభేదిపరిజ్ఞానము గలవాడనై తెలియక చేసిన పాపము కారణముగానే నేడిట్టి దురవస్థ ప్రాప్తించినది. ఇప్పుడు నాకు ఆ శాపమునను భవించు సమయము సమీపించినది - అని యీ గాథను వినిపించి దశరథుడు భోరున ఏడ్వసాగెను. మరణము చేరువకు వచ్చున్నదని తలచి చింతించుచు అతడు కౌసల్యతో మఱల ఇట్లు పలికెను.

దేవీ! నేను శ్రీరామచంద్రునితోడ వ్యవహరించిన తీరు

సముచితమైనది కాదు. కాని అతడు నా తోడ వ్యవహరించిన విధము మాత్రము అతనికి తగియే యున్నది. కన్నతండ్రి కఱకు మనసువాడై ఈ విధముగా కఠినమైన వనవాసశిక్షను విధించినప్పుడు ఆ తండ్రిని పల్లెత్తు మాటకూడ ఆడక కారడవుల దారి పట్టిన కుమారుడు లోకములో ఎందైన ఉండునా? ఉండడు. నావంటి నిర్దయుడైన తండ్రియు ఎందును ఉండడు. పరమ సౌశీల్యవంతుడైన శ్రీరామ చంద్రుని బోలు తనయుడును ఎందును ఉండడు. మరణకాలమందైన నేను శ్రీరామచంద్రుని దర్శింపజాలను. అంతకంటె ఎక్కువైన దుఃఖము నాకు మఱియేది ఉండును? వికసించిన శరత్కాల తామర పూవును బోలు ముద్దుమోమువాడగు శ్రీరామచంద్రుడు నేటినుండి పదునాలుగేండ్లు గతించిన మీదట కాని మఱల ఈ అయోధ్యలో అడుగుపెట్టడు కదా! నిజమరయగా భావికాలమున మఱలివచ్చిన వేళ ఆ శ్రీరామచంద్రుని వనములకు పంపి నేను ఒక్కసారిగా అనాథుడ నయితిని. అని యిట్లు విలపించుచుండగా దశరథునకు దుఃఖావేగము అతిశయించెను. అంతట అతడు హా రామా! హా రఘునందనా! హా మహాబాహూ! హా పితృవత్సలా! హా శోకనివారకా! హా కుమారా! నీవే మాకు నాథుడవు. నీవే మా తనయుడవు. నీవు ఎందుబోయితివి? హా కౌసల్యా! హా సుమిత్రా! ఇప్పుడు మీరు కూడ నాకు కానవచ్చుట లేదు. అని యీ విధముగా విలపించి మనసు వ్యాకులత, ఆరాటము క్షణ క్షణమునకు పెరిగి దుర్భరము కాగా అర్ధరాత్రసమయమున అసువులను బాసెను.

కావున బాలకులారా! మీరు కూడ ఆ వైశ్యమునికుమారుడగు శ్రవణకుమారునివలెను, మర్యాదాపురుషోత్తముడగు శ్రీరామచంద్రుని వలెను మీమీ మాతాపితరులకు నిత్యము పాదాభివందనములు చేయుడు! శ్రద్ధ, భక్తి, వినయము, సరళ స్వభావమును గలిగియుండి

వారి యాజ్ఞలను పాలించుచు సర్వదా వారిని సేవించుచుండుడు! పైన చెప్పిన విధముగా ఎవరు తమ మాతాపితరుల సేవలో నిమగ్నులై యుందురో వారికి ఆయువు, విద్య, బలము, పెంపొందును. ఇహమునందు, పరమునందు శాశ్వతమైన కీర్తియు, అంతమందు ఉత్తమగతియు ప్రాప్తించును.

శ్రవణ కుమారుడు నేటికిని జనుల చేత కొనియాడబడు చున్నాడు. శ్రీరామచంద్రుని విషయము వేఱుగా చెప్పనక్కరలేదు. అతడు సాక్షాత్తు పరమాత్మ. అతడు లోకమున మానవ మర్యాదలను స్థాపించుటకు పుడమిపై అవతరించిన పరమ పురుషుడు. అతని వ్యవహార మంతయు ఆదర్శప్రాయమైనది. జనులు విధిగా అనుసరించి ఆచరింపదగినది. అతడు తన మాతాపితరులతోడను, గురుజనుల తోడను ఎంతయో శ్రద్ధ, భక్తి, వినయము, సరళ స్వభావము, గలిగి వ్యవహరించెను. సీతతోడను, సోదరులతోడన్ను, ప్రజానీకముతోడను, అలౌకికమైన దయ, ప్రేమభావమును గలిగి మెలగెను. కావున నాయనలారా! మీరు ఆ శ్రీరామచంద్ర సార్వభౌముని పరమాదర్శముగా భావింపుడు! అతని యాజ్ఞలను పాలింపుడు.! ఆ స్వభావమును మీలో అవతరింపజేసికొనుడు ! ఆచరణములను అనుకరింపుడు. యావజ్జీవము అన్ని రంగములయందు, అన్ని విషయము లందును అతనివలె మెలగుటకు ప్రయత్నము చేయుచునే యుండుడు! ఈ విధముగా మీరు నిష్కామభావముతో ధర్మపాలనము చేయుచున్నచో ఆధర్మమే శీఘ్రముగా మీకు భగవత్ప్రాప్తిని గలిగించును. ఇట్లు ధర్మపాలనము చేయుచుండగా మరణము ప్రాప్తించిన అందు కూడ మీకు పరమ శుభమే కలుగును.

''స్వధర్మే నిధనం శ్రేయః'' (గీత 3-35) స్వధర్మమందు మరణము కూడ శ్రేయస్కరమే యగును.

# భక్తి

భగవద్భక్తి యన్నది ఎల్లరకును ఉపయుక్తమైనది. బాలురకు ఎక్కువగా ఉపయుక్తమైనది. బాలుని హృదయము కోమలమై యుండును. అతడు ఏ పని చేసినను దానికి సంబంధించిన సంస్కారము వాని మనసులో దృఢముగా నాటుకొనిపోవును. అతడు పెండ్లి చేసుకొనక యున్నంతవఱకు బ్రహ్మచారిగానే పరిగణింపబడును.

బ్రహ్మ యనగా పరమాత్మ. ఆ పరమాత్మ యందు చరించు చుండువాడు బ్రహ్మచారి. పరమాత్మయందు చరించుట యనగా పరమేశ్వరుని నామ గుణ రూప చరిత్రముల శ్రవణము, మననము, కీర్తనము మున్నగు విధులను నిరంతరము ఆచరించుచుండుట. కావున బాలకులారా! మీరు భగవానుని నామము, రూపము, గుణము, చరిత్రము, ప్రేమ, ప్రభావము, తత్త్వము, రహస్యము, మున్నగు విషయములను గూర్చి నిత్యము మహానుభావులగువారి వలన వినియు, సద్గ్రంథములందు పఠించియు మీమీ హృదయములందు ధారణము చేసి పాటించుచుండవలెను.

అట్లు చేయుట వలన మానవుడు భగవానుని గుణ, ప్రభావ, తత్త్వ, రహస్యాది, విషయములను చక్కగా తెలిసికొని అతనిని బడయ గలుగును. ఈ విషయమున భగవానుడు గీతలో -

శ్లో. మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ. (10-9)

అని చెప్పియున్నాడు. అనగా నిరంతరము నాయందు మనస్సును లగ్నము చేసుకొని నాయందే తమ ప్రాణములను అర్పించు కొన్న వారై భక్తులెల్లవేళల భక్తితత్త్వమును గూర్చి చర్చించుట మూలమున

నా ప్రభావమును ఒకరికొకరు తలుచుకొనుచు నా గుణప్రభావముతోడ నన్ను గూర్చి ప్రసంగించుకొనుచు సంతోషమును పొందుచుందురు. వాసుదేవుడనైన నాయందే నిరంతరము ఆనందానుభూతిని పొందుచుందురు.

శ్లో. తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్
దదామి బుద్ధియోగం తంయేన మాముపయాంతి తే. (10-10)

నిరంతరము నా ధ్యానమునందే నిమగ్నులై ప్రేమపూర్వకముగా నన్నే భజించుకొనునట్టి ఆ భక్తులకు నేను తత్త్వజ్ఞాన స్వరూపమగు యోగమును ప్రసాదింతును. దానితో వారు నన్నే పడయుచుందురు.

ధ్రువుని పేరు జగత్ప్రసిద్ధమైనది. అయిదేండ్ల ప్రాయమునందు అతడొకనాడు తన తండ్రి యొడిలో కూర్చుండబోయెను. అప్పుడు గర్వభరితురాలైన మహారాజ్ఞి సురుచి మహారాజు సమక్షమందే సవతి కుమారుడగు ధ్రువుని ఈసడించుచు ధ్రువా! మహారాజు ఒడిలో కూర్చుండుటకు గాని, రాజ్యసింహాసనమునధిష్ఠించుటకు గాని నీకధికారము లేదు. కారణమేమన్న నీవు నా కడుపున బుట్టినవాడవు గావు. నీకు రాజాసనముపై కోరిక యున్నచో పోయి భగవానుని గూర్చి తపస్సు చేసి యాతని యనుగ్రహబలమున నా కడుపున జన్మింపుము! పొమ్ము! అని పరుషవచనములాడెను.

ఆ పలుకులు పసివాడగు ధ్రువుని హృదయమున ములుకులవలె నాటుకొనెను. అంతట రోదనము చేయుచు ధ్రువుడు తన తల్లియగు సునీతికడకు వెడలెను. కన్నుల నుండి కన్నీరు పొరలి పాఱుచుండగా నిట్టూర్పులు వెడలించుచు ఏడ్చుచు వచ్చిన తన తనయుడగు ధ్రువుని సునీతి లేవనెత్తి యొడిలో కూర్చుండబెట్టుకొనెను. అంతలో సేవకులు వచ్చి జరిగిన యుదంతమంతయు యథాతథముగా ఆమెకెరిగించిరి. సురుచి యాడిన మాటలకు సునీతికి ఎంతయో

దుఃఖము కలిగెను. ఆమె కన్నుదోయి అవిరతముగా అశ్రువర్షము కురియింప మొదలు పెట్టెను. క్రమముగా ఆమె దుఃఖము పెరిగి మేరలు లేనిదయ్యెను. అప్పుడు ఆమె తనయునితో ఇట్లులనెను - ''బిడ్డా! ఈ విషయమున మనమితరులపై దోషారోపణము చేయ పనిలేదు. ఇది యంతయు మన పూర్వజన్మ కర్మ ఫలము. నీవు అభాగ్యురాలనగు నా కడుపున జన్మించితివి. నాయనా! నేను బహు దురదృష్టవంతురాలను. నన్ను దాసిగా స్వీకరించుటకు కూడ నీ తండ్రికిష్టము లేదు. నా సవతి సురుచి యాడిన మాట తథ్యము. ఆమె కొడుకైన ఉత్తమునివలె రాజ్యాసనము పొందవలె నన్న కోరిక నీకున్నచో నీవు ఆ శ్రీహరి యొక్క చరణకమలములనాశ్రయింపుము! ఆమె చెప్పిన మాటయే నేను కూడ నీకు చెప్పుచున్నాను. ఈర్ష్యా భావమును వీడి పరిశుద్ధ హృదయముతో భక్తవత్సలుడైన ఆ శ్రీహరి పాదపద్మములనారాధింపుము. ఆ పరమాత్ముడు తప్ప లోకములోని దుఃఖమును హరింపగలవారు వేఱెవ్వరును లేరు''. ఈ విధముగా తన తల్లి యాడిన మాటలనాలకించి ధ్రువుడు మనస్సులో ధైర్యము వహించి ఆమె కథనమును నెరవేర్చుటకై తండ్రియొక్క నగరమును వీడి వనమునకు వెడలెను. నారదమహర్షి యోగబలము చేత ఈ యుదంత మంతయు నెఱిగి మార్గమధ్యమున ధ్రువునకెదురుగా వచ్చి యాతని శిరముపై కరమునుంచి వత్సా! నీకు మానమేమి? అవమాన మేమి? అట్లు కాదని నీకు మానావమానముల చింతయున్నదని అంధువేని ఆ విషయమున మన కర్మమును మనము నిందించు కొనవలెను. కాని పరులను నిందింపరాదు. తన కర్మముల ననుసరించియే మానవుడు సుఖమునుగాని, దుఃఖమునుగాని, మానమును (గౌరవము) గాని, అవమానమునుగాని పొందుచుండును. మనుజానకు ఏదైన సుఖముగలిగినచో పుణ్యవులు క్షీణించి

దుఃఖములు కలిగినప్పుడు పూర్వకృతపాపములు క్షయమై పోవుచుండును. ఈ విషయములను ఎఱిగి చిత్తమును నిర్మలముగా నుంచుకొనుము! సుగుణసంపదలో నీకంటె అధికుని గాంచి నీవు సుఖమును పొందవలెను. అధమునిగాంచి జాలిపడవలెను. సమానుల తోడ మైత్రిని పాటింపవలెను. అట్లు చేయుచున్ననాడు మనుజునకెట్టి పీడలు, సంతాపములు గలుగవు. నీవు యోగమార్గములను మనసులోనికి రానీయవలదు అని సదుపదేశము చేసెను. అప్పుడు ధ్రువుడు మహానుభావా! దయతో తమరు నాకు ఏ శాంతిమార్గమును చూపితిరో దానిని నావంటి అజ్ఞానులు అనుసరింపజాలరు. నేను క్షత్రియ స్వభావమునకు లోబడినవాడను. కావున నాలో నమ్రత, శాంతి అను లక్షణములు లేవు. స్వామీ! నేను నా తండ్రితాతలు కూడ వడసియుండ నట్టి మహోన్నతపదమును పొందగోరుచున్నాను. మూడులోకము లందును సర్వోన్నతమైనస్థానము ఏదియో దానిని పొందుటకు నాకు మార్గమునెఱిగింపుడు! అని నారదునకు బదులు పలికెను.

ధ్రువుడాడిన యీ మాటలను విని, అతని దృఢనిశ్చయమును పరికించి పరమానందమును పొంది నారదుడు మఱల అతనితో నిట్లు పలికెను. వత్సా! నీ తల్లి యుపదేశమునే అనుసరించి శ్రీహరిని భజింపుము! నీ మనస్సును పరిశుద్ధము గావించుకొని ఆ పరమపురుషుని యందు లగ్నము గావింపుము! ధర్మార్థకామ మోక్షము లనబడు నాలుగు పురుషార్థములను పడయుటకు శ్రీహరిని భజించుట యొక్కటియే మార్గము. కుమారా! నీకు శుభ మగుగాక! నీవు యమునా తీర మందున్న మధువనమునకు వెడలుము. శ్రీహరి సర్వదా అందునెలకొని యుండును. అక్కడ యమునాపావననీరములందు స్నానము ఆచరించి ఆసనమున కూర్చుండి నిశ్చలమైన మనుస్సుతో హరిని ధ్యానింపుము!

ధ్యానవిధము ఇదిగో! ఇది - భగవానుడు సమస్తదేవతల

యందును బహుసుందరమైనవాడు. ఆస్వామియొక్క ముఖము, నేత్రములు ప్రసన్నతను వెలిబెట్టుచుండును. నాసిక, కనుబొమలు, కపోలములు (చెక్కిళ్ళు) అత్యంత సుందరములై ప్రకాశించుచుండును. అతడు సర్వథా తరుణవయస్కుడై తేజరిల్లుచుండును. ఆస్వామి హృదయదేశమునందు భృగులతాచిహ్నము చూడ ముచ్చట గొలుపుచుండును. శరీరచ్ఛాయ నీలమేఘశ్యామలమై నేత్రపర్వము చేయుచుండును. ఆ దేవుని కంఠదేశమునందు వనమాలయు, నాలుగు చేతులందును శంఖ చక్రగదాపద్మములును చెలువారుచుండును. ఆస్వామి శిరమున మణిరత్న ఖచితసువర్ణకిరీటముతో, చెవులయందు మకరాకార సువర్ణకుండలములతో, కరముల కనకన్మణిరత్నమయములైన సువర్ణ కంకణములతో, గళదేశము నందు వివిధముక్తామణిరత్నమయములైన మాలికలతో, కటితటమున కమనీయచేలముతో, వక్షస్థలము నందు మనోహరకౌస్తుభరత్నముతో, మొలపై వెలుగులను విరజిమ్ము మణిరత్న ఖచితమై సువర్ణమయమైనపట్టబంధముతో, పాదములయందు రంగారు బంగారు నూపురముల కాంతి దయానురాగరసత్రివేణి జాలువాఱు నయనారవిందయుగళముతో వెలుగొందుచు చూచువారి మనములను, నయనములకును అనిర్వచనీయమైన యానందమును గలిగించుచుండును. ఆపరమపురుషుని మందహాసము శరత్కాలపు వెన్నెలను తలపింపజేయుచుండును. ఆతని దివ్యమంగళ విగ్రహము ను చూచినవారికి అతడు తనకు అపూర్వమైన వరములు ఏవో ఈయవచ్చెను అన్న భావము గలుగుచుండును. అతడు శరణాగతవత్సలుడు. కరుణామయుడు.

ఈ విధముగా నిత్యము భగవత్స్వరూపమును ధ్యానించుచున్నచో మనస్సునకనిర్వచనీయమైన దివ్యానందము కలుగును. ఒక మాఱు చవిచూచిన మనస్సు ఆ యానందమును వీడి మఱి యెందును

పోవుటకిచ్ఛగింపదు. అది భగవంతునితోడ తన్మయత్వమును పొందును. కావున రాజకుమారా ! నేను నీకు పరమగోపనీయమైన మంత్ర మొకటి యుపదేశించు చున్నాను. దానిని చక్కగా జపించుకొనుము. 'ఓమ్ నమో భగవతే వాసుదేవాయ' అనునది ఆ మంత్రము. ఇది 12 అక్షరములు గల మంత్రము ఈ మంత్రమును పఠించి పవిత్రజలము, పూలు, పూలదండలు, వనములో లభించు ఫలములు, మూలములు తులసీదళములు మున్నగువానితో ఆపరమ పురుషునకు నిత్యము పూజచేయవలెను.

మనస్సును వశీకరించుకొని హరిచింతనము చేయవలెను. శాంతస్వభావము కలిగియుండవలెను. వనములో లభించు కందమూల ఫలాదులను అల్పముగా ఆహారముగా గ్రహింపవలెను. భగవానుని దివ్యగాథలను మానసికముగా ధ్యానము చేయవలెను. ఇంద్రియములను విషయభోగములనుండి వెనుకకు మఱలించుకొనవలెను. భక్తియోగము మూలమున అనన్యభావముతో భగవానుడగు వాసుదేవుని భజించుకొనుచుండవలెను. వత్సా! వింటివి కదా!

నారదుడు చేసిన ఈ యుపదేశమును ఆలకించి ధ్రువుడు ఆ మహర్షికి ప్రదక్షిణ నమస్కారములు ఆచరించి అతనికడ సెలవుగొని మధువనమునకు వెడలిపోయెను.

అక్కడకు చేరి ధ్రువుడు స్నానమాచరించెను. ఆ రాత్రి వ్రతపాలనము చేసెను. అనంతరము దేవర్షి ఉపదేశించిన విధముగా ఏకాగ్రత వహించి భగవదారాధనము చేయ మొదలుపెట్టెను.

తొలుత అతడు రేగిపండ్లనారగించియు, మీదట ఎండు టాకులను భక్షించియు, అటుపిమ్మట జలము మాత్రమే సేవించియు, అంతమున వాయుభక్షణము మాత్రమే చేసియు కాలము గడపెను. అనంతరము ఐదవ మాసమునందు అతడుశ్వాసనిరోధము గావించుకొని

ఒంటికాలిపై నిలచి భగవద్ధ్యానము చేయ మొదలుపెట్టెను. ఎల్లవంకలనుండియు మనస్సును వెనుకకు మఱలించి హృదయము నందు వెలుగొందు భగవానుని ధ్యానమునందు సంలగ్నము గావించెను. అప్పుడుధ్రువునకు భగవానుని రూపమొక్కటి దక్క తక్కినదేదియు కానరాకుండ పోయెను.

అనంతరము భగవానుడు భక్తుడగు ధ్రువునిదర్శించుటకు మధువనమునకు వచ్చెను. అప్పటికి ధ్రువుని బుద్ధి ధ్యానయోగమునందు నిశ్చలముగా నెలకొనియుండెను. అతడు తన హృదయమునందు విద్యుత్ప్రభాభాసమానుడై వెలుగొందుచున్న భగవానుని స్వరూపమును ధ్యానించుచుండెను. అప్పుడు ఆతని హృదయమునుండి భగవానుని మూర్తి యదృశ్యమయ్యెను. తోడనే ధ్రువుడు కలత జెంది కన్నులు దెఱచెను. అంతట ఆ రూపముతోనే భగవానుడు ఆతని కన్నుల ముందు ప్రత్యక్షముగా నిలిచెను. ఆసమయమున ధ్రువుడానందమును, ఆశ్చర్యమును అతిశయింపగా ఆ పరమపురుషుని పాదారవిందములపై సాగిలపడి నమస్కారము చేసెను. పిమ్మట కన్నులతో త్రాగివైతునా? ముఖముతో ముద్దుగొందునా? బాహువులతో కౌగిలిలో బంధించి వేయుదునా? అన్నంత తమకముతో దోయిలి గట్టుకొని నిలిచి యాస్వామిని స్తుతించవలెనని అతడు యేదియు చేయలేకపోయెను. అంతర్యామి యగు వాసుదేవుడు ఆ విషయమునెఱిగి తన చేతిలోని శంఖముతో ధ్రువుని చెక్కిలిని స్పృశించెను.

తోడనే ధ్రువునకు తత్త్వజ్ఞానము, అభయ పదమును సిద్ధించెను. చదువుకొనకుండగనే భగవదనుగ్రహబలమును సమస్తవేదశాస్త్రముల పరిజ్ఞానమును ప్రాప్తించెను. అంతట అతడు మెల్లమెల్లగా నిండు భక్తితో సర్వవ్యాపకుడు, దయాసముద్రుడగు శ్రీహరిని స్తుతింప మొదలుపెట్టెను.

అప్పుడు భక్తవత్సలుడగు భగవానుడు ప్రసన్నుడై ఇట్లు పలికెను. రాజకుమారా! నీకు శుభమగును. నాయనుగ్రహమున నీకు ధ్రువపదముప్రాప్తించును. ఆ లోకము మహాతేజోమయమైనది. ప్రళయము సంభవించి, సృష్టి అంతయు అంతరించినను ఆలోకమునకు నాశము ఉండదు. దానికి జనులందఱును నమస్కారములు చేయుదురు. ఆ స్థానమునందుకొన్న మీదట యోగ్యులైనవారు మరల ఈ లోకములోనికి మఱలి రారు. ఇచ్చట కూడ నీ తండ్రి నీకు రాజ్యము నప్పగించి వనములకు వెడలిపోవును. నీవు 36 వేల సంవత్సరముల పర్యంతము పుడమిపై రాజ్యపాలనము చేసెదవు. నా యనుగ్రహమున నీ అంతఃకరణము విషయభోగములయందు లిప్తము కాకుండును. ఈ విధముగా పలికి, భగవానుడు ధ్రువునకు వరములొసగి అతడు చూచుచుండగనే నిజలోకమునకు వెడలిపోయెను.

ఇక ప్రహ్లాదుడున్నాడు. అతడు భక్తశిరోమణి. అతని విషయము వేరుగ చెప్పనక్కరలేదు. బాలకులారా! అతడు మాతృ గర్భమునందున్నప్పుడే నారదుడు అతనికి భక్తితత్వమునుపదేశించి యుండెను. దాని ప్రభావము చేత అతడు లోకముల భక్తశిరోమణిగా పరిగణనమునందెను. ఆతని తండ్రి ఆతనిని సంహరింపనెంచి నీటిలో ముంచెను. కొండపై నుండి క్రిందకు పడద్రోయించెను. విషము త్రావించెను. సర్పములచేత కరిపించెను. ఏనుగుల చేత త్రొక్కించెను. శస్త్రముల చేత ఖండింపజూసెను. అగ్నియందు త్రోయించెను. ఇట్టివే ఇంకను అనేకములగు ప్రయత్నములు చేసెను. అయినను ప్రహ్లాదునికి హాని ఏదియును కలుగలేదు. ఇది యంతయు భగవద్భక్తి యొక్క ప్రభావము. ఇంతియేకాదు. కడకు హేమకశిపుడు చేత ఖడ్గమును ధరించి తన బిడ్డను తానే సంహరించుటకు కూడ సన్నద్ధుడయ్యెను. శ్రీహరి స్వయముగా నరసింహరూపమున స్తంభమునుండి బహిర్గతుడై

ప్రహ్లాదుని తండ్రియగు హిరణ్యకశిపుని సంహరించివైచెను. అప్పుడు ఆస్వామి ప్రహ్లాదుని ఊరడించుచు – వత్సా! నేను వచ్చుటలో విలంబమైనది. ఆ కారణమున నీవు ఎక్కువ క్లేశములను భరింపవలసి వచ్చినది. నాయీ అపరాధమును మన్నింపుము. అని ప్రియవచనము లాడెను. కాని ప్రహ్లాదుడు భక్తశిరోమణి కదా! అతడు భగవానుని అపరాధమని ఎట్లు భావింపగలడు? ఒక విధముగా ఆవిలంబము నందు కూడ అతడు దయాలక్షణమునే చూచువాడు. అనంతరము ప్రహ్లాదుడు స్వామిని భక్తితో స్తుతించెను. అప్పుడు ప్రసన్నతజెంది భగవానుడు ప్రహ్లాదా! నీకు శుభము గలుగును. నేను నీ యెడల ప్రసన్నుడనయితిని. నీకు ఏమికావలెనో కోరుకొనుమిచ్చెదను. నేనే మానవుల కోరికలను ఫలింపజేసేవాడను. అని వానిని పలుకరించెను. అప్పుడు ప్రహ్లాదుడు – స్వామీ! నాజాతి సహజముగ కామాసక్తమైన (కోరికలను ప్రాముఖ్యమునిచ్చునట్టి) జాతి. వరములను చూపి నన్ను ప్రలోభపెట్టవలదు. మీ యొక్క దుర్లభదర్శన భాగ్యమును వడసి కూడ మిమ్ము సాంసారిక సుఖములు కావలెనని కోరువాడు వ్యాపారియగును. కాని సేవకుడు గాడు. దేవా! కామము (కోరిక) వలన ఎన్నియో అనర్థములు ప్రాప్తించును. కోరికలు ఆవిర్భవించుట వలన ఇంద్రియములు, మనస్సు, ప్రాణములు, శరీరము, ధర్మము, ధైర్యము బుద్ధి, లజ్జ, సంపద, తేజస్సు, స్మరణశక్తి, సత్యము మున్నగునవి వినాశనము నందును. కావున ఓ వరదవరేణ్యా! ఓ నరసింహస్వామీ! మీరు నాకు నేను కోరిన వరమును ఈయనెంచెదరేని నా హృదయములో కోరికలకు సంబంధించిన అంకురము కూడ ఆవిర్భవింపకుండునట్టి వరమును ప్రసాదింపుడు! నేను మిమ్ము కోరు వరము ఇదియే.

బాలకులారా! చూచితిరి గదా! ప్రహ్లాదుని భావములు ఎంత

ఉన్నతవములైనవో? రాక్షసవంశవములో జన్మించియు అతడు భక్తిప్రభావమున భక్తుల పరిగణనములో ప్రథమస్థానమును పొంది కడకు పరమపదమును పొందెను. అతని భక్తి స్వరూపము ఇది -

శ్లో. శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్

అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్.

(భాగవత. 7-5-23)

భగవానుని నామ- రూప-గుణ-లీలా- ప్రభావాదులను శ్రవణము చేయుట, కీర్తనము చేయుట, స్మరణము చేయుట, భగవానుని పాదసేవచేయుట, ఆ స్వామిని పూజించుట, అతనికి వందనము చేయుట, ఆ స్వామికి దాసుడుగా ప్రవర్తిల్లుట, ఆ స్వామితో స్నేహభావమును ప్రదర్శించుట, తనను తాను ఆస్వామికి సమర్పించి వైచికొనుట. ఇవి 9 విధములగు భక్తి ప్రకారములు.

ఈ తొమ్మిది విధములననుసరింపలేని యప్పుడు మానవుడు కేవలవు భగవానుని నామవును జపించుట, స్వరూపవును పూజించుట ధ్యానము చేయుట - అను ఈ మూడు విధములను తప్పక పాటింప వలెను. దాని వలన గూడ మానవుడుత్తమగతిని పొందవచ్చును. బాలకులారా! భగవానునకు వేనవేలు నామములు ఉన్నవి. అందు మీకు ఏ నామము ఇష్టమైన దానిని జపించుకొనవచ్చును. ఆ స్వామికి అనేక రూపములు ఉన్నవి. వానిలో సాకారము కాని నిరాకారము కాని మీకు ఏ రూపము ఇష్టమైన దానిని పూజించి ధ్యానింపవచ్చును. కాని పరమపురుషుడు సర్వవ్యాపకుడు. సర్వశక్తిసమేతుడు సముద్రమంత దయ, ప్రేమ, సుగుణ సంపదయు గలవాడు. ఈ విధముగా ఆ భగవానుని గుణ ప్రభావాదులను తెలిసికొనియే పూజాధ్యానములు చేయవలెను. కేవలము ఆయన నామమును జపించుచు ఉన్నచాలును. ధ్యానప్రక్రియ క్రమముగా

దానియంతట అదే మొదలగును. నిత్యము, నిరంతరము మానసికముగా నిష్కామ భావముతో శ్రద్ధా ప్రేమపూర్వకముగా నామజపము చేసినచో శీఘ్రముగా పాపములు, అవగుణములు, క్లేశములు నశించిపోవును. సమస్త సద్గుణములు, సదాచారములును వానియంతట అవియే సిద్ధించి మానవుడు ధర్మాత్ముడుగా మారిపోవును. క్రమముగా అతనికి పరమానందము నిత్యశాంతియు అనుభవములోనికి వచ్చుట మొదలగును.

శ్లో. అపి చేత్సుదురాచారో భజతే మా మనన్యభాక్
సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః.

(గీత - 9-30)

ఎంతటి దురాచార పరాయణుడైనను మానవుడు నా యందు భక్తిగలవాడై నన్ను నిరంతరము భజించుచున్నచో వానిని సాధుపురుషుడు అనియే యెన్నదగును. ఏలయనిన అతడు స్థిరమైన మనోనిశ్చయము గలవాడు.

శ్లో. క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి
కౌంతేయ ప్రతి జానీహి న మే భక్తః ప్రణశ్యతి.

(గీత : 9-31)

అతడు శీఘ్రముగా ధర్మాత్ముడగును. శాశ్వతమైన శాంతిని పొందును. అర్జునా! నా భక్తుడెన్నడును నాశనమును పొందడు. నిశ్చయముగా ఇది సత్యమని యెఱుగుము.

కారణమేమన భగవన్నామ జపము యజ్ఞములన్నింటియందు ఉత్తమమైనది. దానిని భగవానుడు తన స్వరూపమని తెలిపియున్నాడు. ''యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి'' (గీత:10-25)

మనువు కూడ భగవన్నామమును ప్రశంసించుచు యజ్ఞము లన్నిటియందును జపయజ్ఞము సర్వశ్రేష్ఠమైనదని చెప్పెను.

శ్లో. విధియజ్ఞా జ్జపయజ్ఞో విశిష్టో దశభిర్గుణైః
ఉపాంశుః స్యాచ్ఛతగుణః సాహస్రో మానసః స్మృతః.

(2-85)

విధియజ్ఞములనగా అగ్నిహోత్రాదికములు. వానికంటె జపయజ్ఞము పదిరెట్లు శ్రేష్ఠమైనది. దానికంటె ఉపాంశు జపము (ఇతరులకు వినబడకుండ చేయు జపము) నూరురెట్లు మేలైనది. దానికంటె మానసిక జపము వేయిరెట్లు మేలైనది.

శ్లో. యే పాకయజ్ఞా శ్చత్వారో విధియజ్ఞసమన్వితాః
సర్వే తే జపయజ్ఞస్య కలాం నార్హంతి షోడశీమ్

(మను :2-86)

విధి యజ్ఞములతో బాటు (వైశ్వదేవము, హోమము, నిత్యశ్రాద్ధము, అతిథి భోజనము అనబడు) నాలుగు పాక యజ్ఞములున్నవి. ఇవి యన్నియు జపయజ్ఞము యొక్క 16వ అంశమునకు కూడ సరిగావు.

కావున ఏ ప్రక్రియలను అవలంబించినను అవలంబింపకున్నను కనీసము భగవానుని గుణ ప్రభావములనెఱిగి అతని స్వరూపమును ధ్యానించుటయే తప్పక సర్వదా ఆచరింపవలెను.

★ సమాప్తము ★

శ్రీహరిః

# కల్యాణ వాణి

1. మానవులు తమ జీవన కాలాన్ని అమూల్యంగానూ క్షణికంగానూ కూడ భావించి సమయాన్ని ఉత్తమోత్తమ కార్యములలో లగ్నం చేయాలి. క్షణకాలాన్ని కూడ వ్యర్థం చేయరాదు.

2. కాలాన్ని వ్యర్థం చేసిన వాడు కాలపు విలువ తెలియని వాడే యగుచున్నాడు.

3. మానవమాత్రుడు ఎన్నడూ వ్యర్థంగా ఉండరాదు సరికదా సర్వోత్తమ కార్యాచరణము జేయాలి.

4. మాటలాడునపుడు సత్యంగా, ప్రియంగా, మితంగా, హితంగా, శాస్త్రానుకూలంగా భాషించాలి.

5. పరులెవరైన మనదోషాలను వ్యక్తం చేసినచో వానినిగురించి చర్చించరాదు, చర్చించినచో దోషాలు వర్ధిల్లుతాయి. దోషారోపణ చేసేవారి మనస్సులలో భవిష్యత్తులో అటంకాలు సంభవిస్తాయి. అట్టిదశలో మనం నిర్దోషులము కాజాలము.

6. మనమే నిర్దోషులమయితే దోషాలను ఆలకించి మౌనంగా ఉండాలి. అంతమాత్రంచే మనకెట్టి హానీ సంభవించదు. దోషులమైతే మన దోషాలను రూపుమాపుకోవాలి.

7. దోషాలను చూపేవారిని గురుతుల్యులుగా భావించి ఆదరించాలి. తద్వారా అతడు భవిష్యత్తులో మన దోషాలను ఉత్సాహంగా చూపగలుగుతాడు.

8. మన దగ్గర బంధువుల దోషాలను అకస్మాత్తుగా ప్రకటించకూడదు. దాని వల్ల అతనికి దుఃఖం కలుగుతుంది. అతడు బాగుపడడు.

9. అధికవ్యయం చేయకు, ఋషుల మునీశ్వరుల జీవితం అధిక

వ్యయంతో కూడి లేదు. అధికవ్యయం చేసేవాని జీవితం ధనానికీ, పరులకూ, దాసునిగా చేస్తుంది. తత్కారణంగా అనేక పాపాలు చేయ వలసివస్తుంది. ఇంటింటికి తిరుగవలసి వస్తుంది.

10. భోజన వేళలో రుచివైపు దృష్టి నుంచకు. కారణం? అది పతన హేతువు. ఆరోగ్య విషయమై లక్ష్యముంచడం కూడ వైరాగ్యంలో లోప మవుతుంది.

11. పరున్న వేళలో సయితం భగవంతుని నామరూపస్మరణ విశేషంగా చెయ్యాలి. దానివల్ల శయన సమయం వ్యర్థం కాదు. శయన సమయాన్ని సాధనగా చేయడం కోసం సంసారిక సంకల్ప ప్రవాహాన్ని విస్మరించి భగవన్నామ రూప గుణ, ప్రభావ చరిత్రను చింతిస్తూనే నిదురించాలి.

12. సర్వప్రాణులయందు హేతురహితమైన దయ, ప్రేమలను కలిగి ఉండాలి.

13. భగవంతునిమించిన హితైషి మనకు వేరే ఎవరు లేరు. కావున స్వాధీనంలో వున్న సర్వస్వాన్నే కాదు. బలిచక్రవర్తి వలె నిన్ను నీవు కూడ భగవంతునికి అర్పణ చేసుకోవాలి.

14. వక్తలు చాలమంది వున్నసభలలో అధికవ్యాఖ్యానం చేయరాదు.

15. వీలైనంతవరకూ గురువుకావడానికి యెన్నడూ ప్రయత్నించరాదు.

16. బ్రాహ్మీముహూర్తంలోనే లేవాలి. నిద్రిస్తుండగా సూర్యోద యమయితే ఆరోజు అంతా ఉపవసించి, జపం చేసుకోవాలి.

17. ఏకాంత సాధనను ఫలవంతం చేసుకొనేందుకు సంధ్య, గాయత్రీ జపం, ధ్యానం పూజాపాఠం, స్తుతి, ప్రార్థన, నమస్కారాదుల, అర్థ, భావాలను గ్రహిస్తూ, నిష్కామ భావం, శ్రద్ధ, భక్తి పూర్వకంగా నిత్యం చెయ్యాలి.

18. భగవన్నామ రూపాలను స్మరిస్తూనే సామాజిక, వ్యావహారిక

ఆర్థికాది కార్యాలను న్యాయ పూర్వకంగా నిస్స్వార్థ భావంతో చెయ్యాలి. కారణమేమంటే మన ప్రయత్నాలన్నీ నిస్స్వార్థ భావంతో పరహితార్థంగా చేయడంలోనే మనకు శుభాలు చేకూరుతాయి.

19. దంతధావన, స్నానాది నిత్యకర్మాదులు పూర్తికాకుండ దేనినీ నోటిలో వేసుకోరాదు.

20. భగవంతునికి నివేదన చేసి అధికారానుసారం బలివైశ్వదేవాదుల నర్పించిన తరువాతనే భుజించాలి.

21. నిలబడీ, నడుస్తూనూ తులసిదళం వినా మరిదేనినీ భుజించరాదు.

22. భోజనానికి ఆద్యంతాలలో ఆచమించాలి.

23. ఏకాంతంలో యిద్దరు భాషిస్తూవుండగా వారి సమ్మతిలేకుండ వారి సమీపానికి వెళ్ళరాదు.

24. ధన ప్రాప్తి మనకు వశమైన విషయంకాక పోయినా మానవ శరీర నిర్వహణార్థం కర్తవ్యబుద్ధ్యా న్యాయయుక్తంగా అవశ్యం పరిశ్రమించ వలసినదే.

25. సుఖ దుఃఖాలలో యేది లభించిన అది భగవంతుని మంగళ విధానమేనని గ్రహించి మానవుడు సదా పరమసంతుష్టుడై ఉండాలి.

26. జీవహింస జరుగు నట్టి కార్యాన్ని దేనినీ వినియోగంలోకి తీసుకోరాదు.

27. పట్టును, సిల్కునూ వాడరాదు.

28. భగవంతుని సత్తాను ప్రత్యక్షంగా కంటే పరోక్షంగా దృఢంగా విశ్వసించాలి. భగవంతునిపై విశ్వాసం యెంత ప్రబలంగా వుంటే అంతగా పాపకార్యాలనుండి రక్షింపబడతాము. అట్టిదశలోనే సాధకుని సాధన తీవ్రమవుతుంది.

29. భగవత్ జ్ఞానానికి మించిన జ్ఞానం లేదు.

30. పరమాత్మ ప్రభావానికి మించిన ప్రభావం లేదు.

**31**. మహాపురుషుని ఆచరణకు మించి అనుసరించదగిన ఆచరణ లేదు.

**32**. భగవద్భావానికి మించిన భావం లేదు.

**33**. సమత్వానికి మించిన న్యాయం లేదు.

**34**. సత్యానికి మించిన తపస్సులేదు.

**35**. పరమాత్మ ప్రాప్తికి మించిన లాభమేదీలేదు.

**36**. సత్సంగానికి మించిన మిత్రుడు లేడు.

**37**. దుస్సాంగత్యానికి మించిన శత్రువు లేడు.

**38**. దయకుమించిన ధర్మం లేదు. హింసకు మించిన పాపం లేదు. బ్రహ్మచర్యానికి మించిన వ్రతం లేదు. ధ్యానానికి మించిన సాధన లేదు. శాంతికిమించిన సుఖం లేదు. ఋణానికి మించిన దుఃఖం లేదు. జ్ఞానానికి మించిన పవిత్రం లేదు. భగవంతునికి మించిన ఇష్టమైనది లేదు. పాపిని మించిన దుష్టుడు లేడు.ఇవి ఒక్కొక్కటి తమతమ స్థానాలలో ఒక దానికిమించి వేరొకటి వర్ధిల్లి ప్రధానమైవున్నాయి.

**39**. కామికి లజ్జ ఉండదు. లోభికి అభిమానం ఉండదు. క్రోధికి తండ్రి లేడు. అజ్ఞానికి హద్దులుండవు. భక్తునికి శాపాలుండవు. నాస్తికునికి జపాది సాధనలుండవు. జ్ఞానికి పాపమన్నది లేదు. అంటే ఆయావ్యక్తుల పై ఆయా వస్తువుల ప్రభావం పని చేయదన్నమాట.

**40**. గంగా స్నానం, గోవిందుని సేవ, అర్థ సహితంగా గీతాభ్యాసం గాయత్రీ జపం, గోవిందధ్యానం వీటిలో దేనినైన సరే నిష్కామ భావంతో శ్రద్ధాపూర్వకంగా సేవిస్తే శుభపరంపరలు చేకూరుతాయి.

**41**. సత్యము, అహింస, క్షమ, దయ, సమత్వము, శాంతి, సంతోషము, సరళత్వము, తితిక్ష, త్యాగాదిశస్త్రాలను ధరించిన వానిని శత్రువులు ఈషణ్మాత్ర మనిష్టాన్నయినా కలుగచెయ్యలేరు.

**42**. భగవత్ప్రాప్తి విషయాలు వినా మనస్సులో మరెట్టి విషయా లనూ ఉంచుకోరాదు. మనస్సులో యెట్టి యిచ్ఛ వున్నా పునర్జన్మను

పొంద వలసినదే కనుక యిచ్ఛ, వాసన, కామన, తృష్ణాదులను సర్వదా పరిత్యజించాలి.

**43.** నీ కోరిక ఏమిటి? అని పదేపదే మనస్సును ప్రశ్నించు. ఏది లేదు అని మనస్సునుండి సమాధానం లభించాలి. ఈ ప్రకారమైన అభ్యాసం ద్వారా కోరిక నాశనమవుతుంది. ఇది నిశ్చితమైన విషయము.

**44.** ప్రపంచంలోని యే వస్తువునందూ ఆసక్తి కలిగి ఉండరాదు. కారణం ఆసక్తివుంటే అంతకాలంలో దానికి సంబంధించిన సంకల్పం కలుగుతుంది. సంకల్పం కలిగిందో పునర్జన్మ తప్పదు.

**45.** మహాత్ములకు పునర్జన్మ ఉండదు కారణం? వారి హృదయాలలో కించిన్మాత్ర సంకల్పానికినీ తావు ఉండదు. ప్రారబ్ధానుసారం యేదైనా స్ఫురణ కలిగితే అది కూడ శక్తి, ఆసక్తులు లేక పోవడం వల్ల జన్మనిచ్చేది కావడం లేదు. కార్య సిద్ధ్యాసిద్ధులలో, వాటి హర్ష శోకాదులలో కూడ యీషణ్మాత్రవికారం యేర్పడడం లేదు. సంకల్ప స్ఫురణల భేదమిదియే.

**46.** నిందాస్తుతులను ఆలకించి అణుమాత్రమైనా హర్షశోక, రాగద్వేషాదివికారాలను పొందరాదు.

**47.** శుభాలను కోరునట్టి వారు మానావమానాలను రెండింటినీ కూడ కళంకంగానే భావించాలి.

**48.** మరుభూములలో భ్రమవల్ల జలాలు కనిపిస్తాయి. యథార్థానికి అవి లేవు. కావున ఆ విషయంతెలిసిన వాడు దాహం వేస్తున్నా అక్కడకు జలాల కోసం వెళ్ళనే వెళ్ళడు. ఈరీతిగానే సంసార విషయాలలోకూడ సుఖం గోచరమవుతూ ఉంటుంది. కాని యథార్థానికి ఎంతమాత్రం కాదు. ఆ విషయాలు గ్రహించి విరక్తుడైన వివేకవంతుడు అందులో చిక్కడు.

**49.** జీవన్ముక్తులై జ్ఞానులయిన మహాపురుషుల దృష్టిలో ఈ ప్రపంచమంతా స్వప్నతుల్యమైనదే. అందులకే వారు ప్రపంచంలో ఉంటూ కూడ దానిలో చిక్కరు. సాంసారిక భోగలిప్తులుకారు.

**50.** జీవిస్తుండగానే శరీరాన్ని మృత ప్రాయంగా భావించగలవాడే జీవన్ముక్తుడు, అంటే ప్రాణరహితమైనప్పుడు శరీరంతో యెట్టి సంబంధం లేనివాడై ఉంటాడు. అట్లే ప్రాణాలు వున్నా శరీరంతో నెట్టి సంబంధం లేకుండా సంచరించగలవాడే జీవన్ముక్తుడైన మహావిదేహి అనబడుతాడు.

**51.** మహాపురుషుల చేష్టలు వారియొక్క ప్రజల యొక్క ప్రారబ్ధానుసారం వుంటాయి. అంతే కాదు ఒక్కొక్కచో ప్రజల శ్రద్ధ, ప్రేమ, భగవదాజ్ఞానుసారం కూడ కొనసాగుతుంటాయి.

**52.** సర్వస్వం పోయినా యేకారణంచేతనైనా కించిన్మాత్రమూ పాపం జరుగరాదు. అన్యులచే మనం జరిపించనూరాదు. అట్టి కార్యాలను ఆచరించేవారిని సమర్థించనూరాదు.

**53.** న్యాయంగానే ధనాన్ని సముపార్జించాలి, ఎన్నడూ అన్యాయంగా సంపాదించకూడదు. ఆదశ వస్తే ఆకలితో చావనైనా చావాలి.

**54.** ధైర్యం, క్షమ, మనోనిగ్రహం, అస్తేయం, బాహ్యాభ్యంతర పవిత్రత, ఇంద్రియనిగ్రహం, సాత్త్వికబుద్ధి, అధ్యాత్మవిద్య, సత్య భాషణము, క్రోధంవహించకుండుట యను పదియూ సామాన్యధర్మలక్షణములు.

**55.** విపత్తులలో భగవత్స్మృతి కలిగి వుండాలి. అందులకే కుంతీదేవి నిరంతరం విపత్తులు కావాలని భగవంతుని ప్రార్థిస్తుంది.

**56.** పాండవులు సామాన్యుడైన విరాటుని కొలువులో నుపాధి చేపట్టినా ధర్మాన్ని కించిన్మాత్రమైనా త్యజించలేదు.

**57.** దృగ్గోచర వస్తుజాలమంతా భగవత్స్వరూపంగాన్నూ, చేష్టలన్నియూ భగవంతుని లీలగానూ గ్రహించడం వల్ల భగవత్తత్త్వం అర్థమవుతుంది.

ఓం తత్ సత్ *

# బాలశిక్ష

నా మిత్రులు కొందరు నన్ను పురికొల్పగా నేనీనాడు బాలుర క్షేమమును గోరి వారి కర్తవ్యమును గురించి నాలుగు మాటలు వ్రాయుటకు పూనుకొనుచున్నాను. తల్లిదండ్రులు, గురువు జీవించి యున్నంతవరకును, లేక ఇది చేయదగును, ఇది చేయదగదు అన్న పరిజ్ఞానము వారికి కలుగనంత వరకును ఏ వయస్సు వారైనను బాలకులనియే పరిగణింపవలయును. ఎల్లవారును బాల్యావస్థయందు విద్యాభ్యాసము మీద విశేష శ్రద్ధ వహింపవలయును. పెద్దతనము నందెవరికైనను విద్యాభ్యాసము సాధ్యము కాని విషయము. చిన్న తనమునందు విద్యాభ్యాసము చేయనివారు పెద్దవారైన మీదట పశ్చాత్తాపపడవలసియుండును. కావున బాలురకు విద్యాభ్యాసమవశ్య కర్తవ్యము. వారికి కేవలమొక్క లౌకికవిద్యయే కాదు. ధార్మిక విద్య కూడ నేర్పవలసిన ఆవశ్యకత యున్నది. ఏల యనగా ధార్మిక శిక్షణనుపేక్షించిననాడు క్రమముగా మానవజీవితము పశుప్రాయ మయిపోవును. ధార్మిక శిక్షణ బడయని కారణముననే నేటి బాలురధికముగా తమ యిచ్ఛవచ్చిన విధముగా నిరంకుశముగా ప్రవర్తించుచున్నారు. క్రమముగా వారిలో నిరంకుశత్వము, అదుపాజ్ఞలను మీఱి చరించుట, దుర్వ్యసనములు, కల్ల కపటములు చోరబుద్ధి, జారబుద్ధి, సోమరితనము, ప్రమత్తత మున్నగు దోషము లెన్నియో చోటుచేసుకొనుచున్నవి. ఆ కారణముగా వారైహికముగాను, ఆముష్మికముగాను కూడ భ్రష్టతను కొని తెచ్చుకొనుచున్నారు. వారికి పాశ్చాత్యుల వేషభాషలు, సభ్యతా సంస్కారములు మున్నగు